# నిమ్మతొనలు

ఏమిట్రా ఆ వెధవ పని.... మొక్క లకి అమృతాంజనం రాస్తున్నా వెందుకూ? – కోపంగా ప్రశ్నించాడు తండ్రి.

'రాత్రంతా మొక్కలు వర్షంలో తడి శాయి కదా? జలుబు చేయకుండా ఉండటానికి' అని సమాధానంచెప్పాడు ఐదేళ్ళ నానీ.

—జి రాము

నందిగామ

ఏమయ్యా! జడ్జీగారింటికి నిన్న నువ్వు బ్రాందీ బాటిలు పంపావుట! మరి నీకు కేసు గెలవాలని లేదా?"

'నేనేం పిచ్చివాణ్ణనుకున్నారా? ఆ బాటిలు మన ఎగస్పార్టీ వాళ్ళు పంపి నట్లు పంపానులే!'

—కె నాగేశ్వరరావు

నరసరావుపేట

పిల్లలెంతమంది?' —అడిగింది అన సూయ.

'ఆపరేషన్‌కి ముందు ఇద్దరు, ఆ తరువాత ముగ్గురు' — అని చెప్పింది వకుళ.

'అదేమిటి - ఆపరేషన్‌గాని ఫైయి లయిందా?'

'ఛ....ఛ .... ఆపరేషన్ చేయించు కున్నది నేను కాదుగా!'

—కాంతామణి

ఏలూరు-2

పూర్ణేంద్రుడు అన్నం తింటూండగా పొల మారింది. 'నాకు ఈ మధ్య ఎక్కువగా పొలమారుతోంది నన్నెవరో ప్రతి క్షణం తల్చుకుంటున్నా రను కుంటూ.... ఎవరో ఆ ఆత్మయులు' మంచినీళ్ళ తాగుతూ అన్నాడు పూర్ణేం ద్రుడు.

'బహుశా అప్పులవాళ్ళు అయి ఉం టారులెండి' - పుటుక్కున అనేసింది పూర్ణేంద్రుడి భార్య సుశీల.

—రమ్యప్రియ

జగ్గయ్యపేట

పార్కుకి కుక్కలని తీసుకు రాకూడ దని తెలీదా నీకు?' - మండి పడుతూ అడిగాడు పోలీసు.

"ఆ కుక్క నాది కాదండీ" అన్నాడు గోపీ.

"కాని అది నీ వెంట వస్తోందిగా?"

"మీరు కూడా నావెంట వస్తున్నా రుగా"

—వై వి రమణ

చీరాల

# సృజన

మనిక సాహిత్య వేదిక

ఆగస్టు-అక్టోబర్ 1970 త్రైమాసిక

## కవితలు :

## విమర్శ వ్యాసాలు :



## కథలు :



## సమీక్షలు :



## సాహిత్య లేఖ :

# ప్రాచీన సాహితి

లలిత నికేతన ప్రియ విలాసవతీ ధవళాత పత్ర స
ముల్లసిత వైభవం బనుభవింప బడున్ సుకృతానువృత్తి చే
వెలువగు పుణ్యకర్మము నశించిన నంగజ సంగర త్రుటి
తస్ఖలిత గుణోరు మౌక్తిక నికాయము లట్లు దొలంగు సంపదల్

✵

తనయుపై గలభక్తి తల్లిదండ్రుల మీద
గలుగు నేర దదేమి కారణంబొ
ఇంతిపై గల ప్రేమ యిష్టదైవము మీద
లేదు నరుల కెట్టి లిఖిత ఫలమొ
ధనముపై గల బాళి ధర్మమార్గము అందు
దలపగూడ ద దెట్టి దైవఫలమొ
తన ప్రాణములు మాడ్కి ధరణీజీవుల నెల్ల
గలయ జూడ రదేమి కర్మఫలమొ
సరసిజాసనుడీ రీతి సర్వజనుల
మోహ జలరాశిలో సదా మునుగ జేయు
ప్రణుత ధవళాంగ మౌనిహృత్పద్మభృంగ
అమిత భవభంగ శ్రీ కాళహస్తి లింగ

—కాళహస్తి లింగశతకం

✵

డాసిన నింగితం బఱిగి డాయగ నేరక తత్తరంబునం
జేసిన సేతకున్ బదులు సేయ నెఱుంగక, మేను మేనితో
రాసిన యంతనే కళలు రంజిలి కౌగిట బాల యుండె బో
యా సుఖ మింతయంత యనవైనది గాదు గదయ్య క్రీడికిన్

—చేమకూర వేంకటకవి 'విజయవిలాసం'

# పాతికేళ్ళ నాటి పిక్చర్

### రాజ్యలక్ష్మి వారి
### 'రక్తసంబంధం'

అన్నా చెల్లెళ్ళ మధ్య నుండే ప్రేమానుబంధాన్ని ఆదర్శ శిఖరపు టంచులపై ప్రతిష్ఠింపచేసి, ఆ బంగారు కాంతిని వెండితళుకులో చూపబోయారు నిర్మాతలు. అసందర్భమగు సన్నివేశాలు అనేకం సృష్టింపబడి నప్పటికీ, విభిన్న మనస్తత్వాలు తీర్చి దిద్దడంలో శ్రద్ధ వహించి, సామాన్య జనాభిరుచికి అనుగుణంగా తయారు చేయగలిగారు ఈ చిత్రాన్ని. కార్మిక సంఘాలంటే జడుసుకునే సామాన్య వ్యక్తి, ఆటబొమ్మలు అమ్మి లక్షాధికారి అవడం ఎంత అసంభవమో, ఈ చిత్రంలోని కష్టపరంపరలూ అంతే! స్త్రీ విలన్ (సూర్యకాంతం)తో తప్ప కథని నడపడానికి, పరిష్కరించడానికి మార్గం కనబడలేదు............

....అనగా అనగా ఒకరాజు (ఎన్.టి. రామారావు) వున్నాడు. అతనొక మిల్లు కార్మికుడు. అదే మిల్లులో ఆనంద్ (కాంతారావు) కూడా పని చేస్తుంటాడు, సమ్మె కారణంగా మిల్లు కట్టేస్తారు. రాజు, తన చెల్లెలు రాధ (సావిత్రి) దాచిపెట్టిన వెయ్యిరూపాయలతోను బొమ్మల కంపెనీ పెడతాడు. అతి తొందరలోనే కార్మికుడు రాజు, కాపిటలిస్ట్ అయిపోతాడు. ఆనంద్‌కి తన కంపెనీలో పని యిస్తాడు. మొదట్లో అప్రదిష్ట అనుకున్నా, రాధ ఆనంద్‌ల వివాహానికి సమ్మతిస్తాడు............

....ఆనంద్‌తోబాటు అతని మేనత్త (సూర్యకాంతం), చల్లగా సాగిపోతున్న సంసారంలో అడుగు పెట్టడంతో మామూలు అనుమానాలు, అనుకోవడాలు ప్రారంభమవుతాయి. రాజు భార్య మాలతి (దేవిక) మనసు విరుస్తుంది ఆ లేడీ విలన్. కలతలు, కలహాలు ప్రారంభమవుతాయి. ఆడపిల్లని కని మాలతి చనిపోవడం, ఆపైన అన్నా చెల్లెళ్ళ కన్ను మూయడంతో గాని చీకట్లు చెదరవు. రేలంగి, గిరిజ, రమణారెడ్డి, హాస్యంతో, పదునైన సంభాషణలతో అందరూ 'బావుంది' అనుకునే చిత్రం ఇది.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - నవంబరు 1962



మానవుని మెదడు చాలా గొప్పది. పుట్టినపట్నుంచీ అది విరామం లేకుండా పనిచేస్తూ వుంటుంది — ఒక్క క్షణం కూడా ఆగదు. ఉపన్యాసం యిచ్చేందుకు వేదిక ఎక్కినప్పుడు తప్ప! —హాఫ్‌మాన్

మనం పథకాలు వేయగా, మనకి సంభవించేదే జీవితం —సాంటర్స్

వెనకటి తప్పులు మళ్ళీ చేయడం గాక, కొత్త తప్పులు చేయటాన్ని 'అనుభవం' అంటారు. —ఈనోస్

న్నారు కారు.
ండుతున్నారు
ఘూకకాలం చూరుపట్టుకొని.
విలువలకి వింత వ్యాఖ్యానాలు చేస్తున్నారు.
పాటని బతికించడానికి
కొత్తచిట్కాలు వెదుకుతున్నారు:
కొత్తని హతమార్చడానికి
పాతకత్తులు నూరుతున్నారు:
ఊరుకుంటానా నేను.

కసిగా కసాయిగా
ఉపద్రవంలాగ ఉవ్వెత్తుగాలేచి
సంహారాన్ని స్యందనంచేసి
ఉద్రేక తరంగాలే తురంగాలుగా
ఆగ్రహం కొరడాని చేబూని
సాయుధ విప్లవ బీభత్సుని సారధినై
భారత కురుక్షేత్రంలో
నవయుగ భగవద్గీతా ఝంఝుని ప్రసరిస్తాను
మంటలచేత మాట్లాడించి
రక్తంచేత రాగాలాపన చేయిసాను.

జీవితంలోని ప్రతిక్షణాన్ని వాటి పరిశోధనలకే వెచ్చించి ప్రపంచానికి అమూల్యమైన రహస్యాలను ప్రకృతి విచిత్రాను భూతులను అందించి విజ్ఞాన భారత పర్వంలో అమరుడైనాడు. అతనే డాక్టర్ సలీం అలీ..... సరోజినీ నాయుడు మౌలానా షౌకత్ అలీ వంటి నాయకులతో కలిసి స్వాతంత్ర్య ఉద్యమంలోకూడా పాల్గొన్న అలీ "ది ఫాల్ ఆఫ్ ది స్పారో" అనే స్వీయ చరిత్రతో పాటు "ది బుక్ ఆఫ్ ఇండియన్ బర్డ్స్" "ది హాండ్ బుక్ ఆఫ్ ఇండియన్ బర్డ్స్" అనే ప్రఖ్యాతి నొందిన పుస్తకాలను రచించారు. "ది బుక్ ఆఫ్ ఇండియన్ బర్డ్స్" ఇప్పటికే పన్నెండు ముద్రణలను పొందిందంటే ఆ పుస్తకం విలువ ఎంతటిదో అర్థం చేసుకోవచ్చు. డాక్టర్ సలీం అలీ తన జీవన సుదీర్ఘ యాత్రలో 91 సంవత్సరాలు పూర్తి చేసుకొని 1987 జూన్ 20వ తేదీ రాత్రి కన్ను మూసారు. ప్రపంచంలోని ప్రముఖ పక్షి శాస్త్రజ్ఞుడిగా గుర్తింపు పొందిన అలీ.......... భారత్‌కు ఎవలేని కీర్తి ప్రతిష్టలను, భావితరానికి పక్షుల గురించిన విలువైన సమాచారాన్ని అందించారు.

—ఎ

'జాగృతి'లో

## అనాస

ప్రపంచ ప్రఖ్యాతి చెందిన పండ్లలో అనాస ఒకటి. మనదేశంలో అస్సాం, కేరళ, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్ ....... అనాసను సాగుచేస్తున్నారు. అనాసలో 'సి', 'బి', 'ఎ' విటమినులు అధికంగాఉన్నాయి. అనాసను పండుగా తినటానికే గాక పండ్లరసం (జామ్), చాక్‌లెట్లు, సారాయి, వెనిగార్ తయారు చేయటానికి కూడా వినియోగించవచ్చు. అనాసను డబ్బాలలో ముక్కలుగా నిల్వచేయవచ్చు. పెరటి తోటలలో తక్కువ ఖర్చుతో సులభంగా అనాసను పెంచవచ్చు..... మంచు కురవని 15-35 సెంటీగ్రేడు ఉష్ణోగ్రతగల ప్రదేశాలలో అనాస బాగా పెరుగుతుంది. 100-150 సెం.మీ. వర్షం కురిసే ప్రదేశాలు ఎక్కువ అనుకూలం. అనాసను సముద్రమట్టంనుంచి 1100 మీటర్ల ఎత్తువరకు సాగు చేయవచ్చు. మెట్ట ప్రాంతాలలో వర్షాధారం కింద కూడా పండించవచ్చు. ఇది నీటి యెద్దడిని తట్టుకొంటుంది.... బరువైన బంకనేలలు, చవిటినేలలు, ఉప్పునేలలు పనికిరావు. మంచి వడపోత శక్తిగలిగి, నీటి సదుపాయం కలిగిన ఎర్రనేలలు, ఎర్రగరువునేలలు శ్రేష్ఠం. నేలలలో సున్నపుపాలు హెచ్చుగా ఉండకూడదు.

—ఆర్ చంద్రశేఖర్

'అన్నదాత'లో



బోటని (వృక్షశాస్త్రం) అనగా అందమైన పువ్వుల్ని నోరుతిరగని గ్రీకు, లాటిన్ పేర్లతో పిలిచి అవమానించటం. —అల్ఫొంజోకార్

## మానవ ప్రగతి

### సూపర్ కండక్టర్

నేటి అమెరికా దేశం సూపర్ కండక్టర్ల పరిశోధనా రంగంలో ఇటీవల సాధించిన తాజా పురోగతిపై ఈ మధ్యనే వార్తలు వచ్చాయి. ఇప్పుడున్న సూపర్ కండక్టింగ్ పదార్థం 'మోసుకు' పోగల విద్యుచ్ఛక్తికంటె 100 రెట్లు అధిక విద్యుచ్ఛక్తిని 'మోసుకెళ్లగల' కొత్త సెరామిక్ పదార్థాన్ని అమెరికన్ శాస్త్రవేత్తలు అభివృద్ధి పరచినట్టు ఆ వార్తలు తెలిపాయి. అయితే ఈ వార్తల వెనుక మరొక ఆసక్తికరమైన అంశం వున్నది; ఈ కొత్త సూపర్ కండక్టింగ్ పదార్థాన్ని అభివృద్ధి పరచిన అమెరికన్ శాస్త్రవేత్తల బృందానికి భారతీయ సంతతికి చెందిన ఒక పరిశోధకుడు నాయకత్వం వహించారు. లూధియానాకు చెందిన ప్రవీణ్ చౌదరి అనే ఈ శాస్త్రవేత్త ప్రపంచ ప్రసిద్ధి గాంచిన ఐ.బి.ఎం. (ఇంటర్నేషనల్ బిజినెస్ మెషిన్స్) కంపెనీలో 1966 నుంచి పనిచేస్తున్నారు. ప్రస్తుతం ఆయన ఈ అమెరికన్ కంపెనీ శాస్త్రవిజ్ఞాన విభాగం ఉపాధ్యక్షునిగా, భౌతికశాస్త్ర పరిశోధనల డైరెక్టర్‌గా వున్నారు.....

....ఐ.బి.ఎం పరిశోధకుల బృందం కనుగొన్న కొత్త సూపర్ కండక్టింగ్ సెరామిక్ పదార్థం వల్ల ప్రపంచంలోని అత్యంత శక్తిమంతమైన కంప్యూటర్ల పరిమాణాన్ని ఒక 'ఫుట్‌బాల్ సైజు'కి తగ్గించి వేయవచ్చు. అంతే కాక, ఈ కొత్త పదార్థం వల్ల ఇప్పటి కంప్యూటర్ల వేగాన్ని సుమారు 10 రెట్లు పెంచవచ్చు. తమ బృందం కనుగొన్న కొత్త సూపర్ కండక్టింగ్ పదార్థం ఇండియాకు ఎంతో ప్రయోజనం చేకూర్చగలదని డాక్టర్ ప్రవీణ్ చౌదరి పేర్కొన్నారు. విద్యుచ్ఛక్తిని నిల్వచేయడంలోను, ప్రసారంచేయడంలోను జరిగే భారీ ఇంధన నష్టాన్ని ఈ కొత్త సూపర్ కండక్టర్లు పూర్తిగా నివారిస్తాయి కనుక దీనివల్ల ఇండియా బాగా ప్రయోజనం పొందవచ్చునని ఆయన వివరించారు. కొత్త సూపర్ కండక్టింగ్ పదార్థాల విషయంలో మార్గదర్శక పరిశోధనలు జరుపుతున్న వాటిలో ఇండియా ఒకటని పేర్కొంటూ డాక్టర్ ప్రవీణ్, దీనికి సంబంధించిన బెంగుళూరులోని భారతీయ శాస్త్రవిజ్ఞాన సంస్థలో ప్రొఫెసర్

ఘూగోశం గుండెపైన
అవిగవిగో అవిగవిగో అనవరతం ఎగిరేను
మరికొంచెం మరికొంచెం మరికొంచెం
పరిహద్దులు అధిగమించి
శ్రామికరాజ్య సందేశాన్ని వినిపిస్తున్నాయ్
మనం హరిజనులం గిరిజనులం
అనాగరికులం అడవిమనుషులం
నీగ్రోలం బానిసలం

కాయకష్టంచేసి కనాకష్టంగా బతికేవాళ్ళం
అన్నానికీ ఆనందానికీ
కౌటుంబిక అనుబంధానికీ
సభ్యతకూ సంఘంలో
సమానత్వ హక్కులకూ
అనర్హులం భయస్థులం
నోరులేని జీవులం

జైళ్ళూ కోర్టులు చట్టాలు సంకెళ్ళూ పోలీసుల బయినెట్లూ
అవునవునూ
మన శాంతికి మన భావికి
మన జీవిత సౌఖ్యానికి

అర్ధరాత్రి రేడియో విప్పండి
ఏ ఉదయమైనా వార్తాపత్రిక తిప్పండి

పొలాల్లో అడవుల్లో
ఫ్యాక్టరీల సమ్మెల్లో
చంపబడ్డ రాక్షసులం
రాజద్రోహులం హంతకులం
ఉరికంబం ఎక్కే వాళ్ళం అంతా మనమే

ప్రపంచం నిండా...

ఆరో పరకో అటో యిటో
మన నేరాలన్నీ ఒకే సెక్షనుకిందికొస్తాయి
అందుకే
దారితప్పిన సోదరులందరిదీ ఒకేదారి.

—చెరబండరాజు.

## మండుతున్న అడవి

మండుతున్న అడవులు
పిలుస్తున్నాయి నగరాలను
పాకుతున్న మంటలు
కాలుస్తున్నాయి బంధనాలను
తరతరాలుగా అప్పులో పుట్టి
వడ్డ పెరిగి
అసలుతో ఆనవాలు మాసి
దానిసలుగాతప్ప జీవించలేని
నికృష్ట జీవితాల చేతుల్లో మంటలు.

మహానగరాలుగా వ్యాపించి
వేనవేల నాలుకలు చాచి
దోచుకునే అడవుల్ని వదలి
మండుతున్న అడవులచుట్టూ తుపాకులు,
చెట్టు చెట్టుకు
గుట్ట గుట్టకు ఎగిసే
మానవుల మంటలను
అరికట్టే విఫలయత్నంలో
అధికారం తొత్తులు.

ఆండీస్‌లోని 'లామ' తోను మరి కొందరు టిబెట్‌లోని 'యాక్' తోను పోలుస్తారు. సుమారు 6 అడుగుల ఎత్తుతో 500 కి.గ్రా. బరువు దాకా ఉంటుంది. రొమ్ము క్రింద భాగాన చర్మము పొడుగ్గా క్రిందికి వ్రేలాడుతూ ఉంటుంది. భయాన్ని కల్పించే కొమ్ములు సుమారు 30 సెం.మీ పొడవు వరకూ ఉంటాయి. కొమ్ములు అడుగు భాగం వైపు పసుపు వర్ణంతో ఉంటాయి. కొమ్ములు లోపలి వైపుకు వంకర తిరిగి ఉంటాయి. దీని పుట్టుక గురించి అనేక రకాల వదంతులు ఉన్నాయి. కొందరేమో ప్రథమంగా ఆవిర్భవించిన మిథున్‌లు టిబెటన్ యాక్‌కి, అడవి ఆవుకి కలిగిన సంతానమని నమ్ముతారు. భారత దేశంలో సుమారు 1,06,000 మిథున్‌లు ఈశాన్య ప్రాంతంలో ఉన్నాయి. వీటిలో చాలా జంతువులు మచ్చిక కాబడుతున్నప్పటికీ కొన్ని మాత్రం ఇంకా వన్యంగానే జీవిస్తున్నాయి. ఇవి గుంపులు గుంపులుగా సంచరించడానికి ఇష్టపడతాయి. చల్లని వాతావరణంలో సుమారు 2000 అడుగుల ఎత్తు ప్రాంతాలలో ఇవి ఎక్కువగా సంచరిస్తాయి. ఇవి శాకాహారులు. తిండికోసం నివాస స్థలాల నుండి 5 నుండి 10 కి.మీ దూరం దాకా వెళ్తాయి. గడ్డిని, చెట్ల ఆకులను ఆహారంగా తీసుకుంటాయి. చూడటానికి అందంగా కనిపిస్తుంది మిథున్. ఇది వేగంగా కదలగలదు. తగినంత చాకచక్యం కూడా ప్రదరిస్తుంది. దేహం భారీగా, దృఢంగా ఉంటుంది. అప్పుడే పుట్టిన మిథున్ దూడ పసుపు గోధుమ రంగు కలిగి సుమారు 30 కి. గ్రా. తూగగలదు. నాలుగు నెలల అనంతరం ఇది సహజ వర్ణాన్ని సంతరించుకొంటుంది. ఈ దశలోనే క్రొమ్ములు కూడా పెరగడం ప్రారంభిస్తాయి. సుమారు నాలుగేండ్ల ప్రాయంలో ఈ మిథున్‌లు పరిపక్వతను సంతరించుకొంటాయి. మిథున్ ఆవు ప్రతి సంవత్సర ఒక దూడను ఈనుతుంది - ముప్పయ్యేళ్ల పాటు! ఈశాన్య ప్రాంతాలలో చాలా చోట్ల మిథున్ - పాలనుపయోగిస్తున్నారు. పాలు చిక్కగా, క్రొవ్వు పదార్థాలను ఎక్కువగా కలిగి ఉంటాయి. ఒకొక్క మిథున్ ఖరీదు రూ. 5000 దాకా ఉంటుంది. ఈ మిథున్‌ను హోదాకు చిహ్నంగా గుర్తిస్తారు.

మానవత్వ మెప్పుడూ హృదయంలోని మెత్తదనంలా వ్యక్తమవుతుంది.

* * *

అహింస పూర్తిగా అనుసరణీయమైనప్పుడు, ద్వేషం దానం తనంతటదే మాయమవుతుంది.

* *

ఆకలితో అలమటించేవానికి దేవుడు అన్నమై కనిపిస్తాడు - అందుకే 'అన్నం పరబ్రహ్మ స్వరూపం' అన్నారు.

— గాంధీజీ

## మండుతున్న అడవి

రోగికి బలవంతంగా పడుతున్న
మురిగిన మహాత్ముని మందును
వాంతిచేసుకొంటున్నాయి నగరాలు

శాశ్వతంగా మ్యూజియమ్‌లలోకి
ఎగిరిపోడానికి అంతిమయత్నంలో
కర్ర ఆడిస్తున్న విగ్రహాలు
అడుగడుగునా మట్టిలో
కొట్టుకుంటున్నాయి
కేలండర్‌లకెక్కి
చిరిగిపోయిన సూక్తులు,
చుట్టూ ఉధృతంగా వీస్తోంది
రాజీపడని జ్వాలల గాలి.

నిఖిలేశ్వర్

## 'విప్లవం ఆగదు సత్యం'

రాత్రి
విచ్చుకున్న భయభీతావహం
క్రూరంగా కురుస్తూన్న దోపిడి
పామరులను చీకట్ల పోట్లతో
వేధిస్తున్న స్వతంత్ర రాత్రి
అమానుష ప్రజాస్వామి
అతిభయంకర మర్యాదా పురుషోత్తముడు
రాత్రి పరిపాలన
చీకటి బలగాల పీడన
ఉదయం రాకుండా
ఊరంతా కాపలా
పామరులు
శ్రమజీవులు
ఆకలి సంచారులు

# చందా రచనలు

| | |
|---|---|
| నేటి విలువలు | పరిచయం చేసిన పుస్తకాలు |
| దూరాన్ని జయించిన మానవుడు | అన్యాయం |
| ఫ్లారెన్స్ నైటింగేల్ | ఆఖరి కోరిక |
| కథానికలు | ఎక్కడికి కమలా ? |
| జీవనమార్గం | భానుమూర్తి భార్య |
| ఎలినార్ రూజ్‌వెల్ట్ | రాధ నవ్వింది |
| తొలి పాఠాలు | కొత్త లోకాలు |
| ప్రేమగాథ | కొన్ని గ్రంథాలు |
| హెలెన్ కెల్లర్ | సీతతో సినిమాకు |
| డా॥ మేరి వెర్చిస్ | ప్రజానాయకుడు ప్రకాశం |
| నేల - నీరు | నట్టింట దీపం |
| మహా నగరంలో | మాంగుళూర్ మెయిల్ |
| జీవితం | మహాబలిపురం |
| నవచైనా | మనకీ ఒక కారు |
| ప్రతి గురువారం | సీతా ఫలాలు |
| ఆరు కథలు | భాష |
| చెట్లు | పూసల మేడ |
| మరొక ఆరు కథలు | శివరావు |
| ఈ నాగరికత | కలడోలేడో |
| నాలుగు రోడ్లు | మావో పాలనలో |
| అణుశక్తి | చైనాలో మైనారటీలు |
| బాలరాజ్యం | అమెరికా |
| గ్రామ వైద్యుడు | జులై నాలుగు |
| సాహస యాత్ర | వరదల్లో వాంగ్ |
| అంతేనా | మాతా భూమాతా |
| కాఫీ మానెయ్యడం | చీమలబారు |

**వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలనుకున్న వారు మీకు చేరువలోనున్న లైబ్రరీలో దొరికితే చదవండి**

"విప్లవం ఆగదు సత్యం'

—"మీరు వదలి వచ్చిన గూడెం
మీరు చేరవలసిన చలివేందిర
మిమ్మల్ని తరిమేసిన చీకటి స్వాములు
మీ ఆశల సమితేసిన అనాది శత్రువులు
తిరగబడి పోరాడండి
గత్యంతరంలేదు
లేకుంటే గమ్యంలేదు
ఎంత నడచినా
రాత్రి ఆవలి తీరంరాదు
పోయిన చోటల్లా చీకటికోట
ఇక్కడ అనంతమైన కాళరాత్రి
ఇది భయంకర దోపిడీ ధృవం
చీకటిసామ్రాజ్యం యథేచ్ఛగాసాగుతూంది.
దీన్ని క్రాంతి గునపాలతో కూల్చాలి.
ఉదయం దానంతటదేరాదు
చుక్కలన్నీ ఒక్కటై పోరాడుతాయి
తూట్లుపడ్డ రాత్రి
ఉదయ సంధ్యలో ఊపిరాడులుతుంది
అప్పుడే ప్రభాతం వెలుగుతుంది.—"

—"ఎవరుమీరు?
ఏ యుద్ధంలో క్షతగాత్రులు?
ఆ నెత్తురు కాల్వలేమిటి?
ఏ సేనలో సిపాయీలు?
మిగతా వారేరి?
మీ విజయం సంగతేమైంది?
మీ వూరు పేరేమి?

—"మనదంతా ఒకేవూరు
మనదంతా చీకటి మండలం అంతేవాసులం
సస్యశ్యామల బహిష్కృతులం
ప్రపంచ దేశంలో మనదొక కుగ్రామం

వెలుగు చూడని గుడ్లగూబలు
బతుకుల్ని తలకిందుల తూచే గబ్బిలాలు
మన గ్రామదేవతలు
ప్రపంచ చీకటి ప్రతినిధి
మన గ్రామ మునసబు
మన గ్రామ పంచాయితీ
చిక్కని చీకటి మండలం
వెలుగు రానీయకుండా
ఏకగ్రీవ జాతీయ తీర్మానం—
ఎర్రిలాంతరు పట్టుకొని
పంచాయితీలో ప్రవేశించి
చీకటి భగ్నం చేయదలచిన
సోదర కూరులంతా
ఎర్రిలాంతరు బద్దలుకొట్టి
చీకటి చీర కుచ్చిళ్ళు సవరిస్తున్నారు
పామరుల క్రాంతిదాహం తాకట్టు పెట్టారు
పడుపుకూడుతో పొట్ట నిమురుకుంటున్నారు.

చిరిగిన విస్తరాకులు మన బతుకులు
విందు భోజనంమెక్కి పారేశారు చీకటి దొరలు
ఎంగిలాకులమై పెంటలనిండా ఎగురుతున్నాం
అధికారం కుక్కలు వెంటాడుతున్నాయి
చెట్టుకొకరం గుట్టకొకరం చెదిరిపోయాం
మాదంతా ఆకలి కొండల ఆదివాసుల ప్రాంతం
ఇరులగిరుల్లో వెలుగు మంటలు మండిస్తున్నాం
రాత్రి స్వాములతో సమరం సాగిస్తున్నాం

నావాళ్ళు
ఆకలిగొన్నవాళ్ళు
అన్యాయం వాతబడ్డవాళ్ళు
అంధకారం అసహ్యించుకునేవాళ్ళు

"ఏమందని చెప్పానుగా !"

"రోడ్లు సర్వే చేయటమేనా పని అంటె !" నవ్వేసాడు చలపతి.

ఒక రోజు మేరిలిన్ తాపీగా కూర్చుంది.

"చూడు చలపతి ! సుమనకి కూడా చూడు!" అంది.

"నాకేం తెలుసునండీ ! మా నాన్న గారిని అడగక పోయారా!"

"చెప్పాను! తనూ చూస్తానన్నారు!"

"పోనీ అందాక ఏదయినా జాబ్‌కి ట్రయి చేయకూడదా !"

"నాకిష్టం లేదు. ఏదో సంసార పక్షంగా చదువుకున్నాను !"

"గ్రాడ్యుయేషన్ సంసార పక్షం చదువా !"

"మామూలు క్లర్క్ జాబుకన్నా పెద్ద డిగ్నిఫైడ్ జాబ్ రాదు ఆ చదువుకి"

"పోస్టు గ్రాడ్యుయేట్ అవలేక పోయారా ?"

"నాకింకా చదువుకోవాలనిపించ లేదు !"

"విచిత్రం అంతా ఇక్కడ్నే వుంది" అన్నాడు చలపతి.

"అంటే ?"

"నాకు చిన్నప్పట్నించీ చదువు అంటే అమిత ఇష్టం. కాని ఎప్పుడు మానేయవలసి వస్తుందో నాకే తెలి యదు. అంత దిగులుగా వుండేది. మీకు చదువుకోవాలంటే ఎంత చదు వయినా చెప్పించగలరు. కాని మీకు ఇంటరెస్టు లేదు."



'మెట్రో' పంపిణీ చేస్తున్న 'ది - విండ్' (ఈదురుగాలి) ఆంగ్లచిత్రంలోని 'ఫిల్'

"అందుకనే మీకు తాతగారు చదువు మానేయవద్దని చెప్పారు."

"చెప్పారనుకోండి ! కాని నాకే సంకోచంగా వుంటుంది. చదువు చదువు అంటూ ఎన్నాళ్ళు పరాయివాళ్ళ ఆదరణ కోసం అర్రులు చాస్తాం !" అన్నాడు.

"చాల్లే ఊరుకో, తాతగారు వింటే బాధపడతారు. చిన్నప్పట్నించీ మా కుటుంబంతో కలిసి వుంటున్నారు. నిన్ను పరాయివాడిగా తాతగారు భావించారా ? పరాయి అన్న భావవే వుంటే నీ చదువు సంగతి పట్టించుకునే వారు కాదు" అంది మేరిలిన్.

"నువ్వు మా కుటుంబంలోని వాడివే అనుకోవాలి, అల్లాంటి సంకోచం

పెట్టుకుంటే ఋణ భారంతో మనసు కృంగిపోతుంది. దానితో చదువు మీద ఆసక్తి తగ్గిపోతుంది" అంది సుమన. తల్లీ కూతుళ్ళ వాత్సల్యానికి కరిగిపోయాడు చలపతి.

"ఎల్లాగో సుగుణ పెళ్ళి జరిగింది. సుమనక్కూడా నీ స్నేహితుల్లో ఎవర యినా మంచివాళ్ళుంటే ఆలోచించు !" అంది మేరిలిన్. చామన చాయతో పొట్టిగా వుంటుంది సుమన. చెంపల్లో నునుపు మెరుపు వుంది. నల్లని వత్తయిన జుట్టు ! కుదురుగా వుంటుంది సుమన.

"దీనికి వంటావార్పు బాగా ఇష్టం చలపతీ ! చక్కగా పెళ్ళి చేసుకోవటం, భర్తకు పిల్లలకి అన్నీ అమర్చటం దీని కిష్టం !" సుమన పక పక నవ్వింది తల్లి చెబుతూంటే !

"ఎందుకు నవ్వుతావు?" అంది మేరిలిన్.

"చలపతి కొత్తవాడా అల్లా చెబుతావు ?" అంది.

"అది కాదు ఒక సంగతి నేను కని పెట్టాను, చలపతీ ! ఇక్కడి వాళ్ళకి డబ్బు అంటే ఆశవుంది. మళ్ళీ నీతి, జాతి, పరువు ప్రతిష్ట అంటూ ఏడు తరాలు ఎత్తిపోయటమూ వుంది !"

"మీరు చెప్పబోయేదీ...."

"పూర్తిగా చెప్పనీయి, చలపతీ ! ఈ పిల్లకు మామూలు తెలుగు పెళ్ళి చేయాలంటే చాలా కష్టపడవలసి వస్తుంది. ఇక్కడ వాళ్ళలో చదువు, అందం తల్లి తండ్రి వున్న ఆడపిల్లల పెళ్ళికే విశ్వప్రయత్నం చేయాలి." మరి మా అమ్మాయికి డబ్బు తప్ప మిగిలిన శుభలక్షణాలేవీ లేవనే చెప్పాలి."



ఉజ్వల ఉదయానికి దారులు
శ్రామికవిజయానికి విప్లవకారులు
విప్లవకారుల వీరనిష్క్రమణానికి
మానవచరిత్ర
విప్లవాభివందనలు చెబుతుంది.–
పదండి పోరాడుదాం
ఉజ్వల ఉదయానికి
నక్షత్రాలవంతెన వేద్దాం–"–

వేగుచుక్క రాలింది సత్యం
పొద్దు పొడుస్తుంది తథ్యం
సమతా సూర్యోదయం నిత్యం
విప్లవం ఆగదు సత్యం.

—జ్వాలాముఖి.

రక్తంలో మొలచిన రత్నాలను
ముచ్చెమటల్లో పూచిన ముత్యాలను
దోచుకునే పిండారీ!
అరల్లో
దాచుకునే బేహారీ!
నీకు తెలియదు వాటి విలువ.
నీకు తెలియదు ఆ
నెత్తుటి మంటల్లో
నిద్రించే కన్నీటి చలువ.

-డాక్టరు సి. నారాయణరెడ్డి

తున్నది. పదమూడు సంవత్సరాలు నిండుతున్నాయి.

"సరే చేసెయ్యండి. సంబంధం చూసారా ?"

"మీ మామయ్యకి వ్రాసాము రా ! ఏవో రెండు మూడు సంబంధాలున్నట్లు చెప్పాడుట ! మనకి అందుబాటులో ఏది వుంటే అది సెటిల్ చేద్దామను కుంటున్నాను."

"అల్లాగే చెయ్యండి," అన్నాడు.

"కట్నం, ఖర్చులకి సొమ్ము జత చేసుకోవాలి. సొమ్ములేకుండా పెళ్ళి సంబంధాలకి ఎగబడటం బావుండదు కదా."

"అయితే ఇప్పట్నించి తొందరపడి పోకండి నాకెక్కడో ఏదో ఉద్యోగం వచ్చి సెటిల్ అయితే అప్పుడు కొంచెం చదువూ సంధ్యా వున్నవాడికిచ్చి చేయ వచ్చును" అన్నాడు చలపతి.

"ఇప్పుడయినా మరీ నాసిరకం సంబంధం కాదులేరా ఒక అబ్బాయి ఇంటర్ చదివాడట. పెద్ద మెడికల్ స్టోర్‌లో గుమాస్తాగా వున్నాడట ! ఇల్లూ రెండు ఎకరాల పొలం వున్నాయిట, అతనికి. ఆరువేల కట్నం కావాలిట. ఇంకొకతను బి.ఎ.బి. ఇడి ప్యాస్ అయా డుట. నలుగురు అన్నదమ్ములు, ఆరుగురు అక్కచెల్లెళ్ళు వున్నారు. కట్నం తీసుకోరుట కానీ...."

"మరేం కావాలిట ?"

"అతని చెల్లెళ్ళలో ఏదో వక అమ్మాయిని నువ్వు పెళ్ళి చేసుకోవాలిట."

"కుండ మార్పిడి పెళ్ళి మనలో లేదు కదా, నాన్నా."

"అంటే నీకు నచ్చిన అమ్మాయిని వాళ్ళ పినతల్లికి దత్తు ఇస్తారుట. కన్యా ధార వాళ్ళే పోస్తారుట. అందుచేత కుండమార్పిడి అవదుట ! ఆ ఉపాయం వాళ్ళే చెప్పారు."

"అప్పుడే ఏం తొందరలలెండి ? ఏదో మంచి ఉద్యోగం చూసుకోవాలి - జీతం అంతా ఒక సంవత్సరంపాటు నిల్వ వుంచాలి. అప్పుడు పెళ్ళి గురించి ఆలోచించాలి. ఇప్పడ్నించే పెళ్ళి రాయబారాలు వద్దు" అన్నాడు చలపతి.

"లా చదువుతున్నావు. లాయరుగా ప్రాక్టీసు చెయ్యవా !"

"పెద్ద పెద్ద లాయర్ల కొడుకులే ఉద్యోగాల్లో చేరుతున్నారు. ఇంకా నాలాంటివాడు లాయర్‌గా ఏం సంపాదిస్తాడు ? ఏదో కంపెనీలో ఉద్యోగానికి ట్రై చేయాలి!" అన్నాడు చలపతి.

"ఏదో చెయ్యి" నేను చాలా మందితో చెబుతున్నానులే ! ఈ వూళ్లో గంగాధరుగారు లీడింగ్ లాయర్. ఆయన వద్ద కొన్ని రోజులు అప్రెంటిస్‌గా చేయవచ్చును. ఆయన ఒప్పుకున్నారు కూడాను."

"వద్దులెండి నేను ఆ ప్రొఫెషన్ లోకి వెళ్ళదలుచుకోలేదు" అన్నాడు చలపతి.

లక్ష్మణరావు ఎత్తుగడ వేరు. రంగనాథంకు చాలా ఆస్తి, ఆడపిల్లలూ వున్నారు. గంగాధరంగారికి పిల్లలు లేరు. తన కొడుకు లాయర్‌గా పేరు తెచ్చుకుంటే గంగాధరంగారి

తమ్ముళ్లైన రంగనాథంకు నచ్చచెప్పి ఒక పిల్లని ఇచ్చి పెళ్లి చేస్తారు, చల పతిని వృత్తిలో పైకి తీసుకుని వస్తాడు అని ఆశపడ్డాడు.

"భ్రమర అమ్మగారు నీతో చెప్పా రుట కదా" అన్నాడు చలపతి.

"ఏమిటి ?"

వాళ్ళ సుమనకి సంబంధం చూడమని"

"అందర్నీ వాకబు చేస్తున్నాను. తండ్రి తాతలు మన జాతి కాదనే సరికి వెనుకడుగు వేస్తున్నారు. బోలెడు ఆస్తి వుందని చెప్పినా ముందుకు రావటం లేదు ! ఎంతమంది తోటో చెబుతున్నాను."

"పిల్లలు సరళ స్వభావులు కదా ! వాళ్ళల్లో విదేశీపోకడ లేమయినా వున్నాయా ! మన తెలుగు ఆడపిల్లల కన్నా చాలా నిదానంగా వుంటారు".

"ప్చ్ ఇల్లాంటి పిల్లలకి తమ భర్త లని తాము వెదుక్కునే చాకచక్యం వుండాలి. లేకపోతే గంపెడు బంధువు లన్నా వుండాలి. రామజోగి పంతు లుకి ఇరసా పరస్తా ఎవ్వరూ లేరు. దూరపు బంధువులు కూడా తమకి సద్వంశం కావాలి అంటున్నారు !" అంది అనసూయ.

"అంతేలే నిజంగా సద్వంశంతో పుట్టిన ఆడపిల్లలు అత్తవారిళ్ళల్లో పనులు చేస్తున్నారా భర్తని చంకల్లో పెట్టుకుని వేరే వెళ్ళిపోతుంటే వృద్ధా ప్యంలో తల్లి తండ్రులు ఎన్ని ఇబ్బం దులు పడతారు ? నీతి జాతి అంటారు. ఒక జాతికి నీతి అంటూ వుంటుంది.



మ్యూజిక్ అకాడమీలో తన నాట్య కౌశలంతో ప్రేక్షకులను మెప్పించిన సినీతార అర్చనా

ఒక నియమము అంటూ వుంటుంది. ఒక జాతి నియమము ఇంకొక జాతి అనుసరిస్తే తప్పేమిటి ? మనం ఎన్ని జాతులు మారామో ఎవరికి తెలుసును ? ఒక ఉపాధి కోసరం ఒక చోటినుంచి ఒక చోటికి మారుతూ అక్కడ స్థాని కులతో వివాహ సంబంధాలు కలుపు కుంటూ వచ్చిన వాళ్ళం కామా ? వీళ్ళయితే కళ్ళముందరి వాళ్ళు కనుక సంకరజాతి అంటున్నాము. మనకి కొన్ని తరాలు గడిచిపోయాయి కనుక ఎవరికీ తెలియదు. మనదొక జాతి పవిత్రమయినది అనుకుంటున్నాం" అన్నాడు లక్ష్మణరావు. తండ్రి అభి ప్రాయానికి మనసులోనే అభినందిం చాడు చలపతి. తండ్రి పరంగా మేరిలిన్ కుటుంబంతో సంబంధం

ఈ రెండిటి సమన్వయంలోని రస మాధురికి తన్మయ మొందాలో తెలియ కుండా ఉంది' - అంటూ మెచ్చు కుంది ఒక ఫ్రెంచి పత్రిక, వీరి ప్రద ర్శన చూశాక! లియొనాడ్ యాకొబ్సన్ 'కొరియాగ్రిఫిక్ మినియేచర్స్' లో నిష్ణాతుడు. మినియేచర్ అంటే ఏమిటో చెప్పాలి. ప్రపంచ ప్రఖ్యాత శిల్పి రొడన్ (Rodin) నిత్యవసం తం, చుంబనం, ఫ్రాన్సెస్కా (Eternal Spring, Kiss, Francesca) వంటి అనేక శిల్పాలకు జీవకళ పోశాడు. నర్తకీ నర్తకులు వివిధభంగిమలలో, గానానికి అనుగుణంగా డాన్స్ చేస్తూ, ఆ శిల్పాకృతిని మనకు చూపిస్తారు. అలాగే రష్యన్ జానపద గాథల ఆధా రంగా కూడా మినియేచర్స్ ప్రదర్శి స్తారు. ఈ బృందంలో మొత్తం ఏభై అయిదుగురు లావణ్యవతులూ సుం దరకారులూ ఉన్నారు. వీరు ఇరవై ఏకాంకికలు, అరవై మినియేచర్స్‌లో శిక్షణ సంపాయించారు. చిత్రకారుడు చాగల్ పెయింటింగైన 'వెడ్డింగ్ కొర్టెజి' (Wedding Cortege - పెళ్లి వారు) ముగ్ధమనోహర ఛాయలకు ప్రతిరూపం. 1976 నుంచి యాకొబ్సన్‌తో బాటు మకరొవ్ కూడా ఈ కంపెనీ అభివృద్ధికి పాటుపడుతున్నారు. సోవియట్ సంప్రదాయం, సంగీత రీతులు, వస్తు స్వరూపం లోతుగా తెలి యకపోయినప్పటికీ, ఆ కళాకారులలోని ఆంగికం, సౌకుమార్యం, లయబద్ధమగు విన్యాసం, సంగీత ఝరితో కలిసి పోవడం - యివి మనవి ఆనంద డోళి కలపై విహరింపజేస్తాయి.

. . . . . 04

'సన్నజాజి పువ్వులో, కన్నెపిల్ల నవ్వులో.... అందకత్తె చూపులో, సందెగాలి వూపులో' ప్రేమ ఎలా ఉంటుందో చెబుతారు శోభన్ బాబు, రాధ (వేటూరి గీతిక - బాలు, జానకీల గాత్రం). అలాగే, 'యర్రా యర్రాని రూపు - వర్రా వర్రాని సూపు సత్యభామో, సత్యభామ' (సీతారామ శాస్త్రిరచన - బాలు, సుశీలల గాత్రం). 'నీ కొంగూ - నీ పొంగూ, కోలాట మాడిందమ్మా' అనే జొన్న విత్తుల పాటకు బాలు, జానకీల గాత్రం. 'మహామాయదారి కాలమొచ్చెతల్లో' (వేటూరి రచన - బాలూ శైలజల గాత్రం).... 'ఓ పగటి భాగవతులూ మీ పాటకు జేజేలు - రంగులు పూయని వేషగాళ్లు - ఈ సంఘంలో కో కొల్లలుండగా - మీ కులవిద్యను అడిగేదెవరు ?' - అని నారాయణ రెడ్డి ప్రశ్నించే గీతానికి గాత్రం బాలసుబ్రహ్మణ్యం.... సంగీత దర్శ కత్వం : రాజ్ - కోటి.... రాఘవేంద్ర సినీ క్రియేషన్స్‌వారి 'దొరగారింట్లో దొంగోడు' చిత్రంలో శోభన్‌బాబు, రాధ, సత్యనారాయణ, మారుతీరావు, రాజా, హరిప్రసాద్, అన్నపూర్ణ, పూర్ణిమ మున్నగువారున్నారు. గణేశ్ పాత్రో మాటలు. దర్శకత్వం : కోడి. రామకృష్ణ. నిర్మాత : కందేపి సత్య నారాయణ. పి ఆర్ ఒ : ఉమ.

అభ్యుదయ రచయితల సంఘం ఎత్తుబడిపోయి ఎన్నోఏళ్ళయింది. మాట్లువేసే ప్రయత్నాలన్నీ ఫలించకుండా పోయాయి. ఈ చిల్లికుండలో ఏ నీరూ నిలవలేదు, కొత్త నీరు దీని చాయలకేరాలేదు. చరిత్ర తొక్కసాగిన కొత్తపుంతను ఇది పట్టించుకోలేదు. స్వాతంత్ర్యోద్యమ మధ్యకాలంలో, నెహ్రూమార్కు సోషలిజానికి యువశక్తుల కళ్లు భ్రమిసినవేళ, సీమచదువులకు వెళ్లి ఉండిన కలవారింటి దొరబిడ్డలు యూరపులో 'పాపులర్‌ఫ్రంట్' దశలో సాహిత్యరంగాన దూరివచ్చిన కల్తీసోషలిస్టుభావాలను తలకెక్కించుకొనివచ్చి లక్నో కాంగ్రెసు మహాసభాప్రాంగణంలోనే ప్రేమ్‌చంద్, సరోజనీ నాయుడువంటి జాతీయవాదుల ఆశీస్సులతో అభ్యుదయ రచయితల సంఘాన్ని స్థాపించారు. రెండవ ప్రపంచయుద్ధ మధ్యకాలానికిగాని అది ఆంధ్రదేశానికి చేరుకోలేకపోయింది. కమ్యూనిస్టుపార్టీ పెంపకంలో అది అచిరకాలంలోనే పెరిగి పెద్దదైంది. యుద్ధకాలంలో అటూ ఇటూ మారిపోసాగిన కమ్యూనిస్టుపార్టీ సిధానాలను సాహిత్యరంగంలో ప్రతిబింబిస్తూ, సామ్రాజ్యవాద వ్యతిరేకత ధ్వజచ్ఛాయల్లో ఇది నానాగోత్రీకూలనూ కూడగట్టగలిగింది. "విశాలమైన ప్రాతిపదిక" అనే ఆత్మవంచనపూర్వకమైన నినాదంతోటి త్వరలోనే ఇది వర్గదృక్పధాన్నీ, మార్క్సిస్టు అవగాహననూ జాతీయవాదంతోటీ సంప్రదాయపరత్వంతోటీ అనుబంధించివేసింది. తనకు వచ్చిన వాపంతా బలుపనే అనుకొంది. 1955 నాటికిగాని తన బలమెంతో తనకు తెలిసిరాలేదు.

సంస్థగా అభ్యుదయ రచయితల సంఘం మీమాకిందూ అవుతున్న ఈకాలంలోనే (1943-1955), ఒక సాహిత్యవైఖరిగా తెలుగు రచయితలను చాలాబలంగా తనవైపుకు మరల్చుకోగలిగింది. వాస్తవ వాదం రచనలలో బాగా చోటుచేసుకొంది. కవిత్వం ప్రజల పోరాటాలకు అంకితమైంది. భావకవిత్వపు మత్తువదిలేలా సాహిత్యమూ జీవితమూ పెనవేసుకుపోయాయి. కొత్త రచయితలలో ఎక్కువమంది ఇటేరాసాగారు. ఇలా అభ్యుదయ రచనా సంప్రదాయం ఒకటి విశిష్టంగా తెలుగులో ఏర్పాటై, బలీయమైన సాహిత్య ప్రభావంగా పరిణమించింది. సంఘసభ్యులుకాని రచయితలుగూడా ఈ ప్రభావానికి లోనయ్యారు. ప్రతి కొత్త ధోరణినీ అభ్యుదయధోరణిఅనడం పరిపాటి అయింది. సామ్యవాదులూ, జాతీయవాదులూ; వాస్తవవాదులూ, ఆదర్శవాదులూ; ప్రయోగపరులూ, సంప్రదాయపరులూ; అంతర్జాతీయవాదులూ, జాతీయవాదులూ— ఎలాంటి విచక్షణాలేకుండా అభ్యుదయ రచయితలనిపించుకోగలిగారు.

1955 తదనంతరం దేశజీవితంలో వచ్చిన మార్పులూ సాహిత్యంలో తలెత్తిన కొత్త ధోరణులూ, అభ్యుదయ రచయితల సంఘంలో ప్రతిబింబించలేదు దాని ప్రణాళిక వేసినచోటనే ఉండిపోయింది. దాన్నిమార్చి 'నూతనకాలావసరాలకు అనుగుణంగా

మార్చే ప్రయత్నాలమీద ఇన్ని చర్నీళ్లు కుమ్మరించడమే జరుగుతూవచ్చింది. కమ్యూనిస్టు ఉద్యమంలో చీలికలు తలెత్తాక, ప్రభుత్వం వత్తాసుతో భారీయెత్తున మేళాల స్థాయిలో అట్టహాసంగా ఆర్భాటంగా జరుగుతూ వస్తున్న ఇస్కస్ మహాసభల్లాగే అభ్యుదయ రచయితల మహాసభకూడా జరుపుకోవాలనే తహతహ, ముఖ్యబాధ్యులలో కనిపించసాగింది.

ఈలోపల దేశం, కాలం కొత్త సవాళ్లను విసిరి, రచయితలలోకూడా అపూర్వమైన ధోరణులను కలిగించాయి. ఎన్నిక మన్నికలకూ, ఓటు సీటు బేరసారాలకూ, శాసనసభా ప్రధాన కార్యక్రమాలకూ అంకితమై, ప్రజల అసంసిద్ధత పేరిట విప్లవకార్యాచరణను మాటలతో దాటవేస్తూ, సిద్ధాంత యుద్ధాలతోటే శక్తియుక్తులను వ్యయపరచుకొంటూ, ప్రజలను ఉత్తేజపరచి సంఘటితంచేసే ఆలోచనలేకుండా ఉండిపోయిన కమ్యూనిస్టు పార్టీతోటి ముఖ్యంగా యువకులు విసుగెత్తిపోయారు. ఓపిక తగ్గింది. ఆరాటం హెచ్చింది. ఇటీవలికాలానఉన్న ఒక్క ప్రజాపోరాటమైన గిరిజన ఉద్యమం మీద అభినివేశం పెరిగింది. ఆ ఉద్యమానికి అండదండలిచ్చే ఉద్దేశంతో వివిధప్రాంతాలలో జరగసాగిన దాడులగురించి సానుభూతి కలిగింది. దీనికి యువకులను నిందించి లాభంలేదు. మార్క్సిస్టు అవగాహన తమ వంటింటికుందేలు రెమ్మనుకొనే వైఖరి కమ్యూనిస్టు పార్టీలకు ఉన్నంతసేపూ, యువజనాందోళనగానీ వారి వ్యగ్ర మనస్కతగానీ వేరేదారి చూచుకొంటుంది. తప్పు ఆ పార్టీలది. విప్లవానికి అనుకూలించగల సాంఘిక శక్తులనన్నిటినీ, అందులోనూ యువశక్తిని, ఎప్పటికప్పుడు తమవైపుకు ఆకర్షించుకుని, ఆ పదార్థానికి అంటుకొని ఉండకతప్పని మురికినీ మైలనూ తొలగించి మెరుగుచేసుకొనేస్థితిలో అవి ప్రస్తుతం లేవు. ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు ఉద్యమ ప్రారంభసమయానికీ ఈ నిశ్శక్త, నిస్తబ్ధసమయానికీ ఉన్న ముఖ్యమైన భేదం ఇదే. పార్లమెంటరీ కార్యక్రమంతప్ప తక్షిన ప్రయోజనకరమైన పనులకు పూనికచెయ్యలేని దుస్థితిలోఉన్న కమ్యూనిస్టుపార్టీలు, ఫ్రాన్సుదేశంలోలాగా విద్యార్థి, యువజన, యువ కార్మికశక్తులు ప్రారంభించి చాలావరకు విజయవంతంగా నిర్వహించిన మహోద్యమాలు విప్లవలక్ష్యం చేరకుండా అడ్డుదగిలిన సన్నివేశాలనుబట్టి, విప్లవ వ్యతిరేకశక్తులుగా పర్యవసిస్తాయేమోనన్న భయసంశయాలు యువకులకు లేవని చెప్పలేను.

అంతేగాదు. ఆరుద్రగారి మాటల్లో 1955 తర్వాత తెలుగు సాహిత్యంలో రాజకీయాల ప్రభావానికి "దింపుడుకళ్లాం" ఆశలుకూడా తీరిపోయాయని అభ్యుదయోద్యమ విరోధులు చంకలు గుద్దుకొంటూ వచ్చిన కాలం ఇది. సిద్ధాంతాల ప్రభావానికి తిలక్ కవిత్వం భరతవాక్యం పలికిందనికూడా చెప్పి ఇంకొకరు సంతోషించారు.

మార్క్సిజానికి కాలదోషంపట్టిందన్నారు మరికొందరు. మ తతావాదం పై మెట్టని చూపారు ఇంకా కొందరు. ఇంకా మార్క్సిజాన్ని పట్టుకు వేలాడుతున్నాడని శ్రీశ్రీని తప్పుపట్టి, ఆ గుప్పిటినుండి బయటపడి స్వేచ్ఛ సంపాదించుకొన్నందుకు ఆరుద్రనూ సోమసుందర్‌నూ అభినందించిన ప్రబుద్ధులకూడా ఉన్నారు. గోముఖ వ్యాఘ్రాలుకొన్ని శ్రీశ్రీ ఒక్క చేతిమీద నెలకొల్పి నిర్వహించిన ప్రచండ విప్లవ సాహిత్య సంప్రదాయాన్ని పౌరాణిక ఐతిహాసిక సంప్రదాయంతోటి ముడివేస్తూ ఆత్మసంతృప్తి పొంద సాగారు. అభ్యుదయ రచనకు ప్రాణపదార్థమైన మార్క్సిస్టు అవగాహనకు యిలా తలోవైపునుంచీ ప్రమాదాలు ముసురుకువస్తున్నప్పుడు, అభ్యుదయ రచయితలసంఘం గానీ, "అభ్యుదయం" అంటే విశాలార్థాన్ని మాత్రమే చెబుతూ నన్నయ్య, తిక్కన, వేమన్న, కందుకూరి, గురజాడ, గిడుగులతో నేటి అభ్యుదయ సాహిత్యాన్ని అనుసంధానిస్తూ, చివరకు ప్రేమైక పరాయణమైన, శృంగారైక మగ్నమైన కాల్పనికవాద కవిత్వాన్నికూడా చేదబిలిచి బుజంచరిచి అందులోనూ అభ్యుదయాంశను దర్శించే పార్టీ వ్యాఖ్యాతలుగానీ ఒరగబెట్టిందేమిటి?

పైపెచ్చు "కమ్యూనిస్టు" పత్రికలలో శ్రీశ్రీ, కుటుంబరావుగార్ల నేటి అభిప్రాయాలమీదనేగాకుండా వాళ్ళ అక్షర సంపదమీదకూడా మూకుమ్మడి దాడి చేయడం ఉద్దేశరహితమేమీకాదు. రాజకీయ వ్యూహంలో ఇదొక అంశం మాత్రమే. మహా జర్లకూ మహావిజ్ఞాపన పత్ర సమర్పణలకూ రాజకీయోద్యమాలను దిగజార్చి, పాలక వర్గంచేసే చట్టాలలో అక్షరాల సవరణలు ప్రతిపాదించడంతోటి ఘనకార్యం ఏదోచేసి సాధించామని అల్పసంతృప్తిపొంది, "నిర్మాణాత్మక"మైన తోడ్పాటులాంటి నినాదాలతో పాలకవర్గాన్ని గద్దెమీద ఉంచేందుకు తోడ్పడుతూ, రాజకీయాలను రంకువేషాలుగా మార్చిన "విప్లవ"పూర్వసువాసినులే, అభ్యుదయ సాహిత్యోద్యమదురంతానికి బాధ్యులు, అభ్యుదయ రచనా సంప్రదాయంపట్ల అశేషగౌరవం కలిగిన రచయితలే, ఆసంఘాన్ని విడిచిపోవలసిన పరిస్థితిని కలిగించినందుకైనా ఈరాజకీయ కపటనాటక సూత్రధారులను అభినందించాలి. పరోక్షంగా, అసంకల్పితంగా, విప్లవరచయితల సంఘానికి వీళ్లు అనుకూల పరిస్థితులు కల్పించారు.

## 2

"తెలుగు సాహిత్యం అభ్యుదయ రచనలదశ దాటిపోయింది." అని శ్రీశ్రీ ఒక్కడే అంటే, పైత్యవికారంవల్లనో ఆత్మసమర్థనకోసమూ అన్నాడు కాబోలని చెప్పేవాళ్లు ఎందరైనా ఉంటారు. నిజానికిగూడా "అభ్యుదయ" రచనలదశ

ఇకనుంచి విన్నటిదే. కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) కార్యదర్శి, శ్రీ మోటూరి హనుమంతరావుగారు తమ "ప్రజాశక్తి వ్యాసక్రమంలో (16-7-70) ఒక మాట అంటున్నారు.

"మానవసమాజంలో ఉద్భవించిన ఆశయాలలోకల్లా మహోన్నత మైనఆశయం మార్క్సిజం. ఆ ఆశయానికి అంకితమైనవాడు మార్క్సిస్టు. మార్క్సిస్టు అయిన వాడెవ్వడూ, అతడు రచయితో కవో అయితే, అభ్యుదయకవీ రచయితా కాకుండా వుండలేడు. అలాగే ఆ మహోన్నత ఆశయానికి వ్యతిరేక కంకణం కట్టుకున్న కమ్యూనిస్టువ్యతిరేకి ఎవ్వడూ వాడి జీవితంలో మంచి సంస్కర్త, అభ్యుదయరచయిత కాజాలడు... అభ్యుదయపంథా పట్టడం ఆరంభదశ. దాని ఉన్నతదశ మార్క్సిజం"

ఈ సూత్రీకరణతో (విడిచిపెట్టిన కావ్యాలతో మాత్రంకాదు.) నామట్టుకు నాకు అభిప్రాయం భేదంలేదు. అభ్యుదయ రచయితల సంఘం యెన్నడూ మార్క్సిజం పట్ల తన విధేయత గురించి బాహాటంగా చెప్పలేదు సరిగదా, ఆ మాట వాడినందుచేత పది మందికీ తాను భయంకొల్పుతానేమోఅని ముందుగా తానే భయపడింది. బిడియపడింది. ఇటీవల సెవెన్‌స్టార్స్ సిండికేటువారిచేత అచ్చువేయించిన పత్రాన్నిచూస్తే, అభ్యుదయ రచయితల సంఘ ప్రణాళికకుగల పరిమితులు తెలిసివస్తాయి, "లిబరల్" భావాలుగల ఏ సాహిత్యసంస్థఅయినా తన పరువు ప్రతిష్ఠలకు భంగంరానివిధంగా ప్రకటించగలిగిన ఆశయాలే అందులో ఉన్నాయి. ప్రపంచశాంతి, అంతర్జాతీయ సంఘటన, సర్వతో ముఖమైన జాతీయాభివృద్ధి, కార్మిక జనశ్రేయస్సు, స్త్రీజనవిమోచన, సోషలిస్టుసమాజ స్థాపన, వాస్తవవాద, మానవతావాద దృక్పథం, సంఘప్రయోజనపరమైన కళ, శాస్త్రీయవైఖరి!

ఈ ఆశయాలు తమంత తాము మంచివే. అయితే అక్కడితోనే అభ్యుదయ రచయితల సంఘం సాఫల్యంపొందగూడదు. కాలం మారింది. మార్క్సిజం దొంగాట లాడనక్కర్లేదు. సాయుధ ప్రజాపోరాటాలకు అనుకూల్యం కలుగుతూవుంది. చిల్లర సంస్కరణలు ఈ వ్యవస్థను నిలబెట్టేవేగాని కూలదోసి మహత్తరమైన మరోవ్యవస్థను ఏర్పరచేవికావు. ఈ వ్యవస్థను నిలబెట్టే మాయోపకరణాలైన పార్లమెంటులాంటి సంస్థలద్వారా, దాన్ని కూలదోసే మార్పురాదు. అందుచేత విప్లవాన్ని బాహాటంగా తమ లక్ష్యంగా గుర్తించి. దీర్ఘకాలికమైన ప్రజల పోరాటాలకు ప్రోత్సాహాన్నికలిగించే విధంగా సాహిత్య సృజన చేసేందుకై, మార్క్సిజాన్ని సిద్ధాంతంగానూ కార్యచరణ విధానంగానూ నిర్భయంగానూ అంగీకరించే రచయితలు అభ్యుదయరచయితల సంఘాన్ని

వదిలిపెట్టి బయటపడి రావలసివచ్చింది. ఒక లేఖలో కుటుంబరావుగారన్నట్లు, "అభ్యుదయ రచయితల ప్రణాళికలో ఈనాటి విప్లవ కవిత్వం ఇమిడేది కల్ల."

విప్లవ రచయితల సంఘం ఏర్పడకముందునుంచీ దాని అవసరంగురించి ఉత్తర ప్రత్యుత్తరాలలోనూ సంభాషణలలోనూ క్రమేపి ఒక గుర్తింపు కలుగుతూ వచ్చింది. విశాఖపట్నంలో శ్రీ శ్రీ సన్మానం జరిగిననాటినుంచీ ఇది ఆచరణీయమైన ప్రతిపాదనగా రూపొందింది అభ్యుదయ రచయితల సంఘ కార్యదర్శి శ్రీ తుమ్మల వెంకటరామయ్యగారు ఈనాడు కాదనవచ్చునేమోగాని, ఆ సంఘంలో చీలిక రావచ్చునని చాలారోజులకిందటనే ఒక లేఖలో నేను హెచ్చరించానుకూడా. "తెరవెనుక భాగవతం" లోపడి ఆయన దీన్ని ఖాతరుచెయ్యలేదు.

ఈ పరిణామంలో యువకులు నిర్వహించిన పాత్ర అత్యంత ప్రముఖమైనది. శ్రీశ్రీనిగానీ మరొకరినిగానీ "అదరించి బెదరించి లొంగదీసుకోవాలని దిగంబరకవులూ వారి మిత్రులూ చాలారోజులుగా తీవ్ర ప్రయత్నంచేస్తూ ఉన్నారు" అని తుమ్మలవారు ఒక వ్యాసంలో (విశాలాంధ్ర 13-7-70) అన్నారు. ఇది నిజంకాదన్నా వారునమ్మరు. శ్రీ శ్రీకి ఉత్తరాలు వెళ్లినమాట నిజమే. సదస్సులో పాల్గొనవద్దని పదిమందీ పది మాటలు చెప్పిందీ నిజమే. పాల్గోడానికి ఆయన తన సంసిద్ధతను తెలిపినప్పుడు శ్రీశ్రీని విమర్శించిందీ వాస్తవమే. అయితే ఇవి బెదిరింపులేనా? తుమ్మలవారు వర్ణించినట్లు, సదస్సుముందూ వెనకా అచ్చుపడివచ్చిన "రంగురంగుల కరపత్రాలు" చూస్తే, ఇవి బెదిరింపులుకావు, కర్తవ్యబోధనలని తెలుస్తుంది. అవి శ్రీశ్రీనిమాత్రమే ఉద్దేశించి చెప్పినకావు, ఈ చారిత్రకదశలో రచయితలు— ముఖ్యంగా "అభ్యుదయ" రచయితలు నిర్వర్తించాల్సిన బాధ్యతలగురించి గుర్తుచేసినవనీ తెలుస్తుంది.

"సాహిత్యం కేవలం జీవితాన్ని నిర్వచించడానికా లేక అస్తవ్యస్తమైన యీ సాంఘిక జీవితాన్ని మార్చడానికా?"

ప్రపంచానికి రకరకాల అర్థాలుచెప్పి వ్యాఖ్యానాలు చేసే ఫిలోసఫర్లకూ, ప్రపంచాన్ని మార్చజూచిన మార్క్సుకూఉన్న భేదంలాంటిదే, అభ్యుదయ రచయితల సంఘం ఆశయాలకూ విప్లవరచయితల సంఘం ఆశయలకూ మధ్యగలభేదం. కాలంతోబాటు నడవలేకనే అభ్యుదయ రచయితలసంఘం వెనుకబడిపోయింది. జాతి జీవనగమనాన్ని ప్రగతి మార్గాన్ని నిర్దేశించవలసిన రచయితలు "ఎటువైపో తేల్చుకోవాలి, తమకమిట్మెంట్ ప్రజాపక్షం అనిరుజువుచేయాలి" అభ్యుదయ సాహిత్య సదస్సు కార్యదర్శి శ్రీ రాంభట్ల కృష్ణమూర్తిగారికేమో, "కమిటెడ్ అయిననాడు కవెలా అవుతాడు?" అనే

# మాలతీ చందూర్

## నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16 – 50 |
| కాంచనమృగం | 16 – 50 |
| భూమి పుత్రి | 16 – 00 |
| మధుర స్మృతులు | 14 – 00 |
| ఓ మనిషి కథ | 16 – 00 |
| ఏమిటీ జీవితాలు | 12 – 00 |
| మనసులోని మనసు | 25 – 00 |
| ఆలోచించు | 9 – 00 |
| రాగరక్తిమ | 18 – 00 |
| మేఘాల మేలిముసుగు | 16 – 00 |
| కలల వెలుగు | 15 – 00 |
| బ్రతక నేర్చినజాణ | 14 – 00 |
| జయలక్ష్మి | 20 – 00 |
| కృష్ణవేణి | 20 – 00 |
| ఏది గమ్యం ఏది మార్గం | 15 – 00 |
| ఎన్ని మెట్లెక్కినా | 18 – 00 |
| సద్యోగం | 15 – 00 |
| లావణ్య | 14 – 00 |

## ఇవిగాక

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 30 – 00 |
| ప్రశ్నలు – జవాబులు | 15 – 00 |
| జాబులు – జవాబులు | 13 – 00 |
| అల్లికలు – కుట్లు | 30 – 00 |
| అందాలు – అలంకారాలు | 15 – 00 |
| మహిళలకు మధురజీవనం | 7 – 50 |
| దాంపత్య జీవితం | 12 – 50 |



20/– రూ॥ పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు, ముందుగా అ స్తకాల ధరకు 2 రూ॥ తగ్గించి M. O. పంపితే, 2 రూ॥లకు మాత్రమే V. P.P. పుతాము. అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.



క్వాలిటీ పబ్లిషర్స్

రామమందిరం వీధి – విజయవాడ-2

మనిషి ముఖం ఒక్కొక్కప్పుడు అతని ప్రవర్తనని కప్పిపుంచుతుంది కూడాను. అబద్ధాన్ని నిజమని నమ్మించబోతారు కొందరు. మానవస్వభావం గురించి మాకు ఓనమాలు కూడా తెలియవని - పత్రిక మొదలెట్టాక తెలుసుకున్నాం.

పత్రికని క్లుప్తంలో తేల్చేసేవాడు కాబట్టి, వెనుకటి యజమానికి ప్రతివారం నాలుగు డబ్బులు గిట్టేవి. యడ్వర్టియిజ్‌మెంట్లమీద వచ్చిన డబ్బు తిన్నగా అతని జేబుల్లోకి వెళ్ళేది. ఏదో మసి పూసి మారేడుకాయ చేస్తూ, ప్రతివారం పత్రికని బయటపడేస్తూండేవాడు. ఈ పత్రికకిగాను అతను ఒక ప్రెస్‌ని, అద్దెకు తీసుకున్నాడు. అచ్చుపనులు సంపాయించి పెట్టేందుకు, ఈ పత్రిక ఉపయోగ పడుతూండేది. రెండు చేతులా సంపాయించి, ఒక మంచి రోజున చేతులు కడుక్కున్నాడు ఆ పాత యజమాని. ఇక మానెత్తికొచ్చి చుట్టుకుంది. మా పని ఎలా ఉందంటే, సర్క్యులేషన్ పెరిగినకొద్దీ ప్రొడక్షను ధరకూడా మరీ ఎక్కువవడం మొదలెట్టింది లాభానికి బదులు నష్టం కనిపించేది.

అందుకనే చిన్న పత్రికవారు అచ్చుపనులమీద ఆధారపడతారు. అచ్చుపనులు వారిని నిలబెడతాయి. పత్రిక సైడ్ బిజినెస్‌గా ఉంటుంది. ఇలాటి పత్రికలు నిజానికి పత్రికల్లా ఉండవు - పొట్లాలు కట్టుకునే కాయితాలా ఉంటాయి. పబ్లిషరుకీ లాభంగాని ప్రజలుకేమీ ప్రయోజనం లేదు. అటువంటి పత్రికకి నోరు వాయీ ఉంటుంది గనకనా ప్రజాభిప్రాయం చెప్పేందుకు? అసలు అటు



విజ్ఞానశాస్త్రం శాఖోప శాఖలుగా విస్తరిల్లింది. తాము స్పెషలైజ్ చేసిన శాఖలోని నూతన పరిశోధనలూ వాటి ప్రభావాలు తెలుసుకునేందుకు విజ్ఞానవేత్తలకు తగినంత వ్యవధి వుండటం లేదు. ఈనాటి పరుగు అలాటిది.

వంటి పత్రిక అందరికీ నవ్వుతాలుగా ఉంటుంది. రేపు ప్రచురణ తేది అనగా యివ్వాళ ఆలోచిస్తాడు ఆ పత్రిక ఎడిటర్. దానిగురించి, కట్టల్లోవి నాలుగు కాయితాలు తీసి, కంపోజ్ చేయించి, మొక్కుబడిలా ఆ నాలుగు పేజీలూ గుద్దించేస్తాడు. వివరికి, ఆ పత్రిక చేతులు తుడుచుకునేందుకు ఉపయోగ పడుతుంది.

నాకు అంతవరకూ అచ్చాఫీసు అంటేనూ, ప్రింటింగ్ అంటేనూ ఏమీ తెలియదు. పత్రికలనేవి పోస్టులో వస్తాయనేకాని, యింత గొడవ వీటికి వున్నదని అనుకోలేకపోయాను. జీవితంలో

పనే. సభ్యులలో ఏకాగ్రత రావడానికి మరింతకాలం పడుతుంది, తప్పదు. చిన్నతనపు చిలిపిచేష్టలకూ దురుసుమాటలకూ కాలం కాదిది. బాధ్యత పెద్దది, వివేచన అవసరం. సంయమనం అంతకంటేను. అయితే రాజీపద్ధతిఅనవసరం. నిజాన్ని వెల్లడించడంలో నిర్భయవైఖరి గురించి మన ప్రణాళిక స్పష్టంచేసింది. నిర్భయవైఖరి అంటే మోటుదనంమాత్రంకాదు. కరకు కోల్పోకుండానే మనం రాయవచ్చు. మార్క్సిజాన్ని సిద్ధాంతంగా ఆమోదించినప్పుడే మనబాధ్యత ఇనుమిక్కిలిగా పెరిగింది. ఒకరౌనన్నా కాదన్న అది మనకు జీవగఱ్ఱ. ఎవరిలిబ్బీకానది. వాళ్లు పదిలంగాదాచుకొని మరొకరికి పాలివ్వం పొమ్మనేందుకు. అది ప్రపంచప్రజలసొత్తు. పార్టీల, సిద్ధాంతవేత్తల, ఖజానాలోనూ జనానాలోనూ అది బందీకాదు. కాబట్టి మార్క్సిస్టు అవగాహనను పెంపొందించుకొంటూ వర్గదృష్టిని అలవరచుకోవడం ప్రస్తుతానికి మనమొదటికర్తవ్యమని నేననుకుంటున్నాను. ఇలా చేయగలిగినప్పుడు మనం సృష్టించే సాహిత్య స్వభావంలోనే గుణాత్మకమైన మార్పు ఏర్పడుతుంది. అప్పుడే మన సాహిత్యం ప్రజల చేతి కత్తిగానూ ప్రజల కంటిచూపుగానూ పరిణమించగలదు.

— కె. వి. రమణారెడ్డి.

# ఈనాటి రచయితలకు కొన్ని నవాళ్ళు:

...కసాయివాడు జీవకారుణ్యంమీద సెమినార్ పెడితే భూతదయ కలవాళ్లు ఉరకటమేనా!

హ్యూమన్ (మానవతావాద) అండ్ రియలిస్టిక్ (వాస్తవికతావాద) దృష్టి (రాతల్లో) ఉన్నంతకాలం ఏమి ఉద్ధరింపు జరిగింది?

—కొడవటిగంటి కుటుంబరావు.

# సాహిత్యంలో విప్లవోద్యమం

దేశం స్వతంత్రమైనాక సాహిత్యమైతే పెరిగిందిగాని, తెలుగులో సాహిత్యో ద్యమం సన్నగిల్లి, క్రమంగా నశించింది. కవులూ, కథకులూ, నవలాకారులూ సొంత దారులు వెతుక్కున్నారు. అయితే వారిలో అభ్యుదయసాహిత్యోద్యమం ప్రభావంపడిన వారు "సరదా"కి రాసేవారికన్న మేలైనసాహిత్యం సృష్టించారు. వారు అభ్యుదయ రచయితల సంఘంలో సభ్యులై ఉండినా ఉండకపోయినా అభ్యుదయ రచయితలే. మార్క్సిజం తెలుసుకున్నా, తెలుసుకోకపోయినా మార్క్సిస్టు దృక్పథంకలవారే. ఈ రచయితలలో కొందరు యువకులు అభ్యుదయ రచయితలసంఘం అవతరించేనాటికి పుట్టనుకూడాలేదు. అటువంటి రచయితలను కొంతమందిని నేను స్వయంగా ఎరుగుదును.

అభ్యుదయ రచయితలకింద టెక్నికల్‌గా చలామణి అయే వారందరూ మార్క్సిస్టులై ఉండాలని చాలాకాలంక్రితం స్థూలంగా అనుకున్నాం. అవసరంలేదన్న మాట ఈనాడు వినిపిస్తుంది. కమ్యూనిస్టులమని చెప్పుకుంటున్నవారుకూడా ఈమాట అంటున్నారు. దానికి వారు చెప్పే కారణం ఏమిటంటే, అనాదిగా అభ్యుదయరచనలు ఉంటూనే ఉన్నాయని. నిజమే, వేమన తన కాలపు జీవితాన్ని విమర్శిస్తూ పద్యాలు చెప్పటానికి మార్క్సిస్టు కావలసిన అవసరం లేకపోయింది. కాని ఈనాడు అభ్యుదయ రచనలు చేసేవాడు మార్క్సిస్టు, లేక మార్క్సిస్టుదృక్పథంకలవాడు, కావటం తప్పని సరికదా? 'మార్క్సిస్టు కానక్కరలేదు' అన్నమాటలో 'మార్క్సిస్టు వ్యతిరేకిఅయినా యిబ్బందిలేదు' అన్న భావం ఇమిడిఉన్నదా, లేదా? "మార్క్సిస్టు కానక్కరలేదు; మార్క్సిస్టు వ్యతిరేకి కాకపోతేచాలు" అనేపక్షంలో మార్క్సిస్టూకాక, మార్క్సిస్టు వ్యతిరేకీ కానివాడు ఏమిటవుతాడు? ఊహకు అందటంలేదు.

ఇందులో అనేక అర్థాలకు తావు కన్పిస్తుంది. "మార్క్సిస్టు కాకుండానే అభ్యు దయ రచయిత కావచ్చు" అన్న వారిలో కొందరి ఉద్దేశం, మార్క్సిస్టు వ్యతిరేకులు కూడా అభ్యుదయ రచనలు చేయవచ్చుననికావచ్చు: మరికొందరి ఉద్దేశంలో మార్క్సిస్టు లంటే కమ్యూనిస్టులని కావచ్చు— కమ్యూనిస్టు కానివాడుకూడా అభ్యుదయ రచయిత కావచ్చుననికావచ్చు. ఈ రెండో అభిప్రాయంతో ఎవరికీ పేచీవుండనవసరంలేదు.

అయితే కొందరు అభ్యుదయ రచనలకూ, అభ్యుదయ రచయితలకూ తేడా చూడటంలేదు. "శ్రీశ్రీ 'మహాప్రస్థానం'రాసేనాటికి మార్క్సిస్టుకాడు" అంటున్నారు. ఆనాడు శ్రీశ్రీ తాను అభ్యుదయ రచయితననీ చెప్పుకోలేదు. అభ్యుదయ రచయితలం మనిగాని, మార్క్సిస్టులమనిగాని చెప్పుకోని వారుకూడా జీవితాన్ని సరిగా అవగాహన చేసుకున్న మేరకు అభ్యుదయ రచనలు చేయవచ్చు. కాని అటువంటివారు రేపు అభ్యుదయ రచన అనిపించుకోనిది చేయవచ్చు. అభ్యుదయ రచయితలు తప్ప అభ్యుదయ రచనలు చేయలేరనీ, అభ్యుదయ సాహిత్యసృష్టి వారి గుత్తాధితరమనీ ఎవరూ, ఏనాడూ అని వుండలేదు. అభ్యుదయ రచయితను అని చెప్పుకుంటూ అభ్యుదయ సాహిత్యోద్యమంలో ప్రవేశించిననాడు కనీసం అభ్యుదయ వ్యతిరేక రచనలు చెయ్యకుండా ఉండగలందులకైనా మార్క్సిజం తెలుసుకునిఉండటం అవసరమంటే అందులో ఆక్షేపించటానికేమున్నదో నాకు తెలియటంలేదు.

మార్క్సిజముకూ, మంచి సాహిత్యానికీ ఏమీ సంబంధంలేదని వాదిస్తూ "మంజువాణి" పత్రిక. శ్రీశ్రీ కుటుంబరావుల ఘనత వారి సాహిత్యంలో ఉన్నదిగాని వారి మార్క్సిస్టు దృక్పథంలో లేదని రాసింది. సాహిత్యానికి టెక్నిక్ ప్రధానమనే వారందరిదీ ఇదే వాదం. శ్రీశ్రీ రాసినా, కుటుంబరావు రాసినా మార్క్సిస్టు అవగాహనతో కూడుకున్న రచనలే అందరికీ నచ్చాయి. అవే ఇతర భాషలోకి తర్జుమా అయాయి. సరదాకి రాసినవి మర్నాడే గాలికి కొట్టుకుపోయాయి.

అభ్యుదయ సాహిత్యోద్యమం సాధించిన సత్ఫలితాలు ఈనాటికీ కనిపిస్తూనే ఉన్నాయి. వీరేశలింగం, గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి త్రయానికి ఈనాడు చాలా గణన వచ్చింది! అందుకుగాను అభ్యుదయ సాహిత్యోద్యమం చేసిన కృషి అమూల్యమైంది. ఆనాడు ఉద్యమం చల్లిన భావబీజాలు ఇప్పటికింకా మొలకెత్తుతూనే ఉన్నాయి. అభ్యుదయ సాహిత్యోద్యమం ఆధునిక తెలుగు సాహిత్యంలో ఒక big leap forward సాధించి, అంతరించి పోయింది. అటు తరువాత సాహిత్యోద్యమం అంటూలేదు.

ఈ పరిస్థితిలో ఆకస్మికంగా హైదరాబాద్‌లో అభ్యుదయ సాహిత్య సదస్సు ఏర్పాటయింది. ఏర్పాటు చేసినవారూ, కార్యభారాన్ని మోస్తున్నవారూ, ఆధ్వర్యం వహిస్తున్నవారూ అభ్యుదయ సాహిత్యోద్యమంతో హిస్టారికల్‌గా గాని. స్పిరిచువల్‌గా గాని ఎలాటి సంబంధమూ కలవారుగా కనిపించలేదు "విశాలాంధ్ర" గ్రూపు మాజీ అభ్యుదయ రచయితల సంఘ సభ్యులు అందులో పాల్గొంటున్నారు. అయితే వారితోబాటు అభ్యుదయ సాహిత్యోద్యమాన్ని వ్యతిరేకించేవారూ అందులో పాల్గొంటున్నారు.

అచ్చులో లేవుగాని యిప్పటికీ వాటికి డిమాండ్ ఉంది.... ఎవరైనా ఉత్సాహవంతులు అందుకు పూనుకోవాలి.

......29

ప్రఖ్యాత ప్లేబాక్ గాయకుడు పి బి శ్రీనివాస్ తమ కుమార్తె సౌ॥ లతకు, చి॥ యస్వి కృష్ణమణికి, నిన్న ఉదయం8 గం॥ 15 ని॥లకు మీన లగ్నంలో తిరుమల కొండ మీద సీతారామకళ్యాణమండపంలోవివాహం జరిపించారు; ఈ సాయంత్రం వెస్ట్ కాట్ రోడ్ వుడ్‌లాండ్స్‌లో రిసెప్షన్. ప్లేబాక్ గాయనీగాయకు లెందరో ఆహూతులను తమ సంగీతంతో ఆనందింప జేశారు. నవదంపతులకు మా శుభాకాంక్షలు.... 'శ్రుతిలయలు' ఎనిమిది నందీఅవార్డులు గెలుచుకొన్న సందర్భంగా సవేరాలాన్స్‌లో సంగీత ధారల చల్లటివేళ చిరునవ్వులు జాలువారే స్నేహమయ సీమతో, చక్కటి సమావేశం.... "మన సంగీతాన్ని, నాట్యాన్ని సామాన్యునికి చేరువగా తెచ్చే ప్రయత్నమే నేను చేసేది. ఆ ప్రయత్నం విజయాన్ని సాధించి నలుగురి మన్ననా పొందితే, నాకది నైతికంగా ఆత్మ స్థయిర్యాన్ని యిస్తుంది" - అన్నారు దర్శకులు విశ్వనాథ్, పత్రికలవారితో యిష్టాగోష్టిగా!....పూలమాలలూ శాలువలూ కార్యక్రమం గీతాసుబ్బారావు క్లుప్తంగా తొందరగా ముగించారు.... ఎక్కడ చూసినా నందులు - విజయోత్సాహ చిహ్నాలుగా - సవేరా పూల్‌లో ఎనిమిది నందులు, సినీతారలని చూసి



సమాజం పట్ల ఆగ్రహం తెలిపేందుకా గడ్డం పెంచడం? రాజ్‌కమల్ ఇంటర్నేషనల్ వారి 'సత్య సందేశం' (కమలహాసన్) వినరిస్తుందా విషయం.



మరింత సొగసులు పోయాయి.... కస్టర్డ్ కేక్ నందీ రూపంలో.... భానుమతి, అంజలీదేవి అయిస్క్రీమ్ తింటూ అమెరికాలో వున్న వాళ్లబ్బాయిల గురించి చెప్పుకున్నారు.... డాక్టర్ ముత్తుకృష్ణారెడ్డి చిలిపి మాటలు.... ఎందరో మిత్రుల హాస్యోక్తులు.... ఈ నాటి ఫంక్షన్ 'ఐడియల్ గెట్-టు-గెదర్'.... 'ఇది సరే, మీకు నేషనల్ అవార్డ్ రావాలి' - అన్నాను సుమలతతో. చిరునవ్వుతో థాంక్స్ చెప్పారామె...... 'శ్రుతిలయలు' గురించి అప్పట్లో వ్రాసిన మాటలు: "దర్శకులు విశ్వనాథ్ దాక్షిణాత్య ప్రేక్షకులకు సమర్పించిన సంగీత మణిహార మిది.

పెదవి కదిపి నవ్వనని
శపథం చేసిన వారిని సైతం
విరగబడి నవ్వించే
గిలిగింతల మార్కు చిత్రం!

రావు గోపాలరావు

ఆర్.జి.ఆర్. ప్రొడక్షన్స్






కోడి రామకృష్ణ

వేకువఝాము నేస్తం







జెమిని

మీ దంత సౌభాగ్యానికి పూర్తి రక్షణ
స్పీరమింట్, పిప్పరమెంట్, లవంగనూనెల సమ్మేళనం

జెమిని కెమికల్ ప్రాడక్ట్స్
P.B.No.7 మచిలీపట్నం-521001.

# గానుగెద్దు

నేను మనిషిని
ఏ దేశంలో ఉన్నా నీకు,
అన్ననో తమ్ముడినో నేను
నల్లవాడినయినా తెల్లవాడినయినా
కొల్లగొట్టేవాడిని మాత్రంకాదు
అందుకే నేను చెప్పిందివిను
గానుగెద్దువై తిరుగుతున్నంతకాలం
నూనెలో భాగం రాదని గుర్తుంచుకో
పనున్నంతకాలం దానావేసి నీ ప్రాణం
రక్షిస్తున్నాడన్న జ్ఞానం తెచ్చుకో
వాని పున్నమ కొరకు నీ బతుకు
అమావాస్య చేసుకున్నా
వాని మూడు నాళ్ళ ముచ్చట కొరకు
నీ బతుకు వెయ్యేళ్ళ భారతం చేసుకున్నా
వాని సౌఖ్యం కోసం
నీ స్వతంత్రాన్ని బలిదానం చేసినా
గంతలు కట్టుకొని బతుకంతా
తిరుగుతూనే గడిపినా
బక్క చిక్కిన నాడు బండెడు
గడ్డివేస్తాడను కోకు
నా తమ్ముడో అన్నో అనుకొని
పాకలో ఉండనిస్తాడనుకోకు
శ్రమను అమ్ముకొని జీవించినవాడు
నీ శరీరాన్ని అమ్ముతాడన్న జ్ఞానం తెచ్చుకో

-పురుషోత్తం.

# రెండు కవితలు

## 1

కదుల్తున్న కాలాన్ని
కాంతిదిశకు నడపాలని
అన్యాయంగా సాగిపోతున్న
దోపిడీ సంఘాన్ని రూపుమాపాలని—
క్షణక్షణానికి మారుతున్న మానవుల
వింతమనస్తత్వాలను మానవాభ్యుదయ
మనుగడవైపుమరల్చాలని
అనుదినం అధికారం పెంచుకుంటూ
అహంతో విర్రవీగుతున్న పెత్తందారీ ఆర్థిక సమాజాన్ని
కూకటివేళ్ళతో కూల్చాలని-
బ్రతకటం చేతకాక వంచనతో
అణగారినఅన్నలకు-తమ్ముళ్ళకు
నిజమైన బ్రతుకుబాటను చూపాలని-
కుయుక్తులతో యుక్తిపరులమంటూ
భుక్తికోసం భుక్తినటిస్తూ ఆత్మవంచన చేసుకునేవాళ్ళకు
లుకలుకలాడే ప్రతిష్ఠాపీఠం కూలిపోతున్నదని చెప్పాలని
మానవత్వాన్ని వ్యక్తంచేయనీయకుండా
వ్యక్తిత్వాన్ని మరుగు పరుస్తున్న సామాజిక
విలువలను సమూలంగా మార్చాలని
రాజకీయ కర్కషత్వంలో
నలిగిపోతున్న శ్రమ జీవులకు
సమసమాజపు చిరస్వప్నం చూపాలని
నిరాశతో నిస్సారంగా
బ్రతుకులు సాగిస్తున్న జీవితాలకు
సూర్యకాంతిలాంటి భవితవ్యంముందుందని
మరీమరీ చెప్పాలని మనసులువిప్పాలని—

కాంచన అంచునె
ఈనాడు సౌఖ్య సౌధం లేస్తున్నది
లంచం పంచనే
ఈనాడు అశ్వమేధం జరుగుతున్నది
జీవితాన్ని వివేచనతో
సామాజిక వేదనతో చూసినపుడు
నాలో ముసురుతున్నవి
మునుపెన్నడు కలుగని బాధలు
కసురుకున్నవి
అసహాయ జాతిని పీడించే జాతిని.
అలసటతో క్రుంగిపోయిన హృదయం
ఆక్రోశంతో ఒళ్లు విరిచింది.

—ఏబసలింగప్ప.

## ఒకఅంచు కలం, ఒకఅంచు కత్తి

వాడిన ఆశయాలు
మోడు వారిన ఆదర్శాలు
మళ్ళీ చిగిర్చేలా,
నిండా అలుముకున్న
నిర్వీర్యతా, నిస్తేజతా మలిపి,
చెదలుపట్టిన ఆలోచనలను దులిపి,
బానిస భావాలతో
జాతిని కలుషితం చేసిన
పాత ముఖాల రాతలుచెరిపి
వాడైన కత్తితో తిరిగి చరిత్ర రాస్తున్నాను
నా అక్షరాలు విప్లవ గర్భాలు.

-శ్రీభాః

# సాక్షిగా నేనక్కడే ఉంటాను

మిత్రమా ?
నీ కెందుకంత కోపం
నిన్నెవరడిగారీలోపం
తొంబదితొమ్మిదికి నూరోపైస కావాలని
గుడ్డివాడి గిన్నెలోని
ఎర్రపైగాని తీసావని-
ఎవిడ ఎండిన ఒంటికి
పదిచుక్కలు పట్టించాలని కొన్నమానెలో
పదోచుక్కను పదిలంగా
పావులోనే ఉంచుకున్నావని-
వద్దంటేవచ్చే
బాలెంత రోగానికి
నువు సూదితో యిచ్చింది
డిస్టిల్డువాటరేనని-
ఆకలితో మాడి జీరబోయిన
కంఠంతో కేకేసేవాడికి
పట్టెడన్నం పెట్టేకంటే
కొవ్వుపట్టిన కుక్క
కేస్తే బాగనుకున్నావని
నిన్నెవరడిగారని
అప్పుడే యీ ఉలికిపాటు
బక్కచిక్కిన శరీరాలు
ఎండిపోయిన ఎముకలు గూళ్ళూ
నిత్యం నీచే పీడింపబడేవాళ్ళు
మండిపోయే ఎండలో

ఎముకలు కొరికే చలిలో
హోరుమనే వానలో
ఎండీ, తడిసీ, వణికీ
పండించిన ఫలితాన్ని నీకిచ్చి
"కర్మ"అని కంటనీరు పెట్టేవారు
నిలదీసి నిన్ను ఒకరోజు
నీచేష్టలకు ప్రాయశ్చిత్తం చేస్తుంటే
సాక్షిగా నేనక్కడే ఉంటాను.

-"బుజ్జి"

# మీకు తెలియదు

మా ఆశల్ని
ఉరికంబా లెక్కించి
చప్పట్లు చరుస్తున్నారు.
మా కన్నీటితో
మీ దాహం తీర్చుకుంటున్నారు.
కొండ క్రింద
మోడు చెట్ల బీడు లాటి
మా జీవితం
మీ సుఖానికే అంకితం
మీకు తెలియదు
మా కళ్ళలో కన్నీటితో పాటు
కణకణ మండే నిప్పుకణాలు దాక్కొనివున్నాయని
మీకు తెలియదు
కొండ చుట్టూ మూగిన
మంచు తెరలు కొద్దిక్షణాల్లోనే కరుగుతాయని
మీకు తెలియదు
మా స్వప్నం నిజమవుతుందని

-టి. భానుమూర్తి.

# విప్లవిద్దాం! రా!

కారాకిళ్ళీ
నముల్తూన్న కిరాణకొట్టూ!
బొజ్జ తడిమి చూచుకొని
బ్రేవుమంటూనేవుండు.
అమాయకుల్ని కొల్లగొట్టి
నింపుకొన్న నీ గల్లాపెట్టి
గునపాల్తో పొడిచి లాక్కుంటూంటే
కిక్కురుమనకుండు.
తెల్లటోపీ
విషం తలతో క్రొవ్విన ఇండస్ట్రియలిస్టూ!
ప్రజలరక్తంపీల్చి నింపుకొన్న
లాల్చీలు చూసుకొని
నవ్వుకుంటూనేవుండు.
ఎర్రబావుటా
ఎగరేస్తూ శూలాల్తో చుంబిస్తే
కదిలిపోతూన్న నేలపై
కదలకుండా ప్రాణం
వదిలిపెడ్తూనేవుండు.
కల్లిబొల్లి కబుర్ల
జనాన్ని బుజ్జగించే కార్మికనాయకా!
వాక్స్వాతంత్రానికైనా నోచుకోని
మూలకూర్చుని మురిసిపోతూవుండు.
చల్లారని ఆర్తితో
విచ్చుకత్తులు ఝుళిపిస్తూన్న వీరుల్ని
నీ నీరస నాదాల్తోనైనా
ప్రోత్సహిస్తూనేవుండు.

ప్లవిద్దాం ! రా !

శోషలిజం
నినాదాలతో అలసి సొలసినతల్లి !
కల్పవల్లి నీ పార్టీల మాననిపుండు
గెలుస్తుందోలేదో చూస్తువుండు.
ప్రజాస్వామ్యపు
గోతుల్లోంచి గొంతుచించుకోకు!
ఆకాశ పుష్పం నీ శోషలిజం, అందరికీ తెలుసు.
ప్రేయసి చొంగను నెమరేస్తు
నిదురిస్తున్న కవివృషభమా!
కత్తిలా కలాన్ని ఝుళిపించు!
లేకుంటే కలం పారేసి
నోరుమూసుకొనివుండు.

పుస్తకాల్తో
తలలు బ్రద్దలుకొట్టుకుంటూన్న నా చిట్టితండ్రీ!
నీ భవిష్యత్తు నాస్తిచేసిన వినాయకుల్ని
క్షమించకు, ఓర్పువహించకు.
పొంగుతూన్న రక్తాన్ని చిందించి
తెగబలిసిన రాజకీయ రాబందులతో
వీరపోరాటం సాగిస్తునేవుండు.
ఆకలికడుపుతో
అస్థిపంజరంలా మిగిలిన మనిషీ!
గొల్లిపిల్లి సారాత్రాగుతూ
పస్తులుపడుక్కొని
పళ్ళికిలించకు, రక్తపుకన్నీళ్ళుకార్చకు.
ఆఖరి రక్తపుబొట్టు
నేలరాలేదాకా విప్లవిద్దాం ! రా !
మరోప్రపంచం చూపించే
మాన్యుడు మనముందున్నాడునడూ

రమేశ్,

# చెలీ! ఇప్పటికిక గుడ్ బై

జీనోపాల్ చొక్కాలతో
కాలరెత్తుక తిరగడమే
ఆడవాళ్ళని ఏడిపించడమే
నాగరికతగా
తలపోసినరోజుల్లో
దేశంలోని యవ్వనం మొత్తం సాధించాలని
ప్రేమకి ఏకైక సామ్రాట్టుగా, నాపాలిటిహీరోగా
మజ్నూని పూజించినరోజుల్లో
చెలీ!
నిన్ను ప్రేమించాను-కామించాను.
నీతోకలిసి వెన్నెలరాత్రుల్ని కప్పుకున్నట్లు
గాలితో పందాలేసుకుని ఆడుకున్నట్లు
పువ్వుల్లోపవ్వళించి
నింగిన మేఘాల్ని
హొంగే అలల్నిచూస్తూ
పూహించాను, కలలుగన్నాను,
విరహగీతాలాలాపిస్తూ
మగవాణ్ణయికూడా బృహన్నలగా బ్రతికాను.

కానీ ఈనాడు——
దేశం మొత్తం పీనుగుపెంటగా
చూడలేనంత హీనంగా, దీనంగా
అవాంఛనీయంగా, అసహ్యంగా
భయంభయంగా బ్రతుకీడుస్తున్న మనుషుల్ని
చేతికందని పంటచేలనిచూస్తూ
చేసిన కష్టాలకి ఫలితంగా

సీరియల్

# ప్రతి గురువారం

భార్యా భర్తలు ఒక చిన్న ఊళ్లో 'ఆర్కాయివ్' అనే వారపత్రిక నడుపు తున్నారు. తమ సాధక బాధకాలు చెబుతోంది రచయిత్రి జేన్ మెక్లవిన్.
— ఇక చదవండి

డవునింగ్ టవున్‌లో మూడు చిన్న బైండింగ్ షాపులు వున్నాయి. ఆ మూడూ జూదశాలలని ఊళ్ళో వాళ్ళందరికీ తెలుసు. పోలీసువారికీ తెలుసు. కాని, ఆ జూదపుకొట్లు నిర్వ హించే ధనవంతుడికి భయపడి, ఎవరూ కల్పించుకునేందుకు ధయిర్యం చెయ్యలేదు.

హామిల్టన్ అను ఒక సంఘ సంస్కారి చెవిని పడింది - ఆ జూదపు కొట్లలోకి హైస్కూలు పిల్లలు కూడా వెళ్తున్నారని. పురపాలక విషయాలు, ప్రభుత్వ విషయాలు, సమాజ విషయాలు – యిలాటి వాటికోసం తన తీరిక సమయం వినియోగించేవాడు ఆ హామిల్టన్. స్థానికాధికారులూ, పోలీసులూ ఆ జూదపుకొట్లు మూసే యించడానికి అశక్తులని తెలుసుకొని పై అధికారుల దగ్గరికి వెళ్లాడు హామిల్టన్. స్టేట్ సిబ్బంది సాయంతో, వెనుకటి పోలీసు యినస్పెక్టరు ఆధ్వర్యాన దాడి జరిగింది. పోలీసు యినస్పెక్టరు చాలా గుట్టుగా ప్రవర్తించి, పై వారి మన్ననలకి పాత్రుడయాడు.

బాబ్ ఈ కథని పుట్టుపూర్వోత్త రాలతో అచ్చు వేయగానే, పోలీసు యినస్పెక్టరు మొహం వికసించింది. స్వయంగా వచ్చి, మమ్మల్ని అభినం దించి వెళ్ళాడు. ఇన్నాళ్ళూ మమ్మల్ని "రెడ్స్" కింద జమకట్టిన కొందరు ఆ దురభిప్రాయం మార్చుకున్నారు. ఏమయితేనేం, కొందరు మమ్మల్ని మంచివాళ్ళు అంటూంటే, మరి కొందరు మమ్మల్ని చెడ్డవాళ్ళు అనే వారు. అది మాకు అలవాటై పోయింది.

వ్యక్తిగత విద్వేషాలకి సంబం ధించిన వార్తలు పట్టుకొచ్చి, అవి మమ్మల్ని వెయ్యమనేవారు. మా కొలబద్ద ఒక్కటే: సాంఘిక ప్రయో జనంలేని సమస్తం, చిత్తుబుట్టకే అంకితం.

రకరకాల స్వభావాలూ, రకరకాల సమస్యలూ తెలుసుకోవడం మనకి ఉత్తేజాన్ని యిస్తుంది. అంతర్ దృష్టితో మనోవైశాల్యం పెరుగు తుంది. మనోవైశాల్యం పెరిగినకొద్దీ ఈ లోకంలో ఏ ఒక్కటీ చీకాకను పించదు. అప్పుడే మనం నిజంగా జీవిస్తాం. ప్రతిదీ

# మాలతీ చందూర్

నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16 – 50 |
| కాంచనమృగం | 16 – 50 |
| భూమి పుత్రి | 16 – 00 |
| మధుర స్మృతులు | 14 – 00 |
| ఓ మనిషి కథ | 16 – 00 |
| ఏమిటీ జీవితాలు | 12 – 00 |
| మనసులోని మనసు | 25 – 00 |
| ఆలోచించు | 9 – 00 |
| రాగరక్తిమ | 18 – 00 |
| మేఘాల మేలిముసుగు | 16 – 00 |
| కలల వెలుగు | 15 – 00 |
| బ్రతక నేర్చిన జాణ | 14 – 00 |
| జయలక్ష్మి | 20 – 00 |
| కృష్ణవేణి | 20 – 00 |
| ఏది గమ్యం, ఏది మార్గం | 15 – 00 |
| ఎన్ని మెట్లెక్కినా.... | 18 – 00 |
| సద్యోగం | 15 – 00 |
| లావణ్య | 14 – 00 |

ఇవిగాక

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 35 – 00 |
| ప్రశ్నలు – జవాబులు | 15 – 00 |
| జాబులు – జవాబులు | 13 – 00 |
| అల్లికలు – కుట్లు | 30 – 00 |
| అందాలు – అలంకారాలు | 15 – 00 |
| మహిళలకు మధురజీవనం | 7 – 50 |
| దాంపత్య జీవితం | 12 – 50 |

---

20/– రూ॥ పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు. ముందుగా ఆ పుస్తకాలధరకు 2 రూ॥ తగ్గించి M. O. పంపితే, 2 రూ॥లకు మాత్రమే V. P.P. పంపుతాము. అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.

క్వాలిటీ పబ్లిషర్స్
రామమందిరం వీధి - విజయవాడ-2

# చీకట్లో సైతం కళ్లు తెరిచి.

పాలగుండెలలోని కన్నీళ్లను
వేరుచేసే రాజహంసల కోసం
అస్థిపంజరాలను కాని
పరిమళాలు పండించే మల్లెతీవెల కోసం
అన్వేషిస్తున్నాను
పేదల వేదన వర్ణించే వేదాల కోసం
ఉన్నతశిఖరాలకు దారివేసే పాదాల కోసం
అన్వేషిస్తున్నాను

పూలగుండెలలోని మధువును
ముల్లు తాగుతున్న సత్యాన్ని చూశాను
మాల మాదిగల కన్నీళ్లను
గాలితుడుస్తున్న దృశ్యాన్ని చూశాను
కంచెవేసే ఓపికలేక కలుపుతీసే యోచనరాక
పంటకోసం ఓ కంట కనిపెడుతూ
నిద్రమాత్రలతో కునుకుతీస్తున్న నాయకుల్ని
చూశాను
ప్రజాస్వామ్యపు కుంటినడకను చూశాను
మానవత్వపు కంటితడిని చూశాను,
ఐనా
ఇన్ని సింధువులు హిమబిందువులై
గరికపోచల బ్రతుకులపై కురుస్తాయని
ఎదురుచూస్తున్నాను
ఇంకా ఈ చీకట్లోసైతం కళ్లుతెరిచి...

—అమ్మంగి వేణుగోపాల్.

పత్రికకి ఎప్పుడూ ప్రజాబలం వెనకనుండాలి. మేము ప్రచురించే వార్తల్లో నూటికి తొంభయి తొమ్మిది వంతులు సర్వసామాన్యమైనవే: నిత్యకృత్యంలో జరిగేవే! కాని, ఆ సర్వసామాన్య విషయాల చుట్టూ ప్రజాజీవితం పరుగులెడుతూంటుంది. ఆ సామాన్య విషయాల కేంద్ర స్థానమే ప్రజ. మాకు కావలసింది ఆ ప్రజా, ఆ ప్రజాబలమూ. అది మర్చిపోయి మేము నిరుత్సాహపడితే, మా పత్రికా ధర్మాన్ని సరిగ్గా నిర్వర్తించ లేక పోయామన్న మాటేగా!

## 14

పత్రిక గురించి మేము కనిన కలల్లో మా త్రివర్ణ స్వప్నంలో, యకవుంట్ పుస్తకాలు, బిల్లు పుస్తకాలు, జమా ఖర్చుల పట్టిక మొదలైనవి లేవు.

1947 జూన్‌లో విశ్రాంతి కోసమని బాబ్ దూర ప్రదేశానికి వెళ్లినప్పుడు, చక్కని సూటులోవున్న పొడుగాటి యువకుడు తిన్నగా ఆఫీసులోకి వచ్చి, తను ఆడిట్‌కోసం వచ్చానన్నాడు. అదేమిటో నాకు అర్థంగాక పోయినా, తెలియనట్లు కనిపిస్తే బావుండదని - "అలాగా" అన్నాను. తెలివి తక్కువ తనం బయట పడనియ్యవచ్చా?

కాని లాభంలేక పోయింది. చిట్ట చివరికి వొప్పుకోక తప్పిందికాదు. ఆడిట్ విషయం నాకేమీ తెలియదనీ, బాబ్ వచ్చాక అతన్ని అడగాలనీ, నన్నడిగి ప్రయోజనం లేదనీ అన్నాను.

"మీభర్త గారు ఎబిసి సభ్యత్వానికి గాను దరఖాస్తు పంపించారు. మీ



రాజాలక్ష్మి ఫౌండేషన్ వ్యవస్థాపకులు రమణయ్య రాజాకు 1987 నవంబరు 19వ తేదీతో అరవై వసంతాలు. రాజాలక్ష్మి అవార్డ్ ప్రదానోత్సవం, షష్ట్యబ్ది వేడుక రాణిసీతయ్ హాలులో జరిగాయి.

కేమంత సర్క్యులేషన్ వున్నట్టు తోచదు. దరఖాస్తు ఎందుకు పంపించారో గానీ!" అన్నాడు ఆ యువకుడు, ఎలక్ట్రిక్ దీపం నుంచి కప్పుదాకా వున్న సాలిగూళ్లవంక ఒక్కసారి చూస్తూ.

"నిజం చెప్పొద్దూ - ఎబిసి పేరు నేను ఇంతదాకా వినలేదు. అదేదో యడ్వర్టయిజ్‌మెంటులు యిచ్చే సంస్థ అనుకుంటాను. యడ్వర్టయిజ్ మెంటులు యిచ్చేందుకయితే, నామాట నమ్మవచ్చు. మా పత్రికకి వున్నంత ప్రచారం ఈ చుట్టుపట్ల ఏ పత్రికకీ లేదు" అన్నాను.

# ముఖచిత్రం

1934 లో హజారీబాగ్ జైలు నుంచి విడుదలయాక, బాద్షాఖాన్‌కి తన యింటికి వెళ్ళగల అవకాశం లేక పోయింది. సరిహద్దు రాష్ట్రానికిగాని, పంజాబ్‌కి గాని వెళ్ళడానికి వీల్లేదని ఆంక్ష విధించింది ఆనాటి బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం. ఆ రెండూ తప్ప దేశంలో మిగతా ఏ ప్రాంతానికైనా వెళ్ళవచ్చునన్నారు. వార్ధా వచ్చి, తనతో సేవాగ్రామ్‌లో ఉండమని ఆహ్వానించారు బాపూజీ. బాద్షాఖాన్ కొన్నాళ్ళపాటు సేవాగ్రామ్‌లో ఉండి ఆశ్రమ నియమావళికి బద్ధులై నడుచుకుంటూన్న రోజులలో ఒక సాయంత్రం వాహ్యాళికెళ్తున్నప్పుడు గాంధీజీ అన్నారట: 'అలీ సోదరులను నేను హృదయ పూర్వకంగా అభిమానించాను - కాని, వారు నానుంచి విడిపోయారు.- మరి మీ విషయమేమవుతుందో' .... "బాపూజీ, మనిద్దరమూ అహింసలోనే ప్రేమవున్నదనీ, ప్రజాసేవలోనే దేవుడున్నాడనీ నమ్ముతున్నాము కాబట్టి, మనకి విడిపోవడమంటూ వుండదు - ఇద్దరిదీ ఒకేమాట, ఒకేబాట" - అన్నారు బాద్షాఖాన్ (ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్) .... ఆయన బాపూజీని మొదటిసారిగా చూసినది 1920లో ఢిల్లీలో ఖిలాఫత్ ఉద్యమ సభలో, అదే సంవత్సరం మళ్ళీ కలకత్తాలో కలుసుకున్నారు .... మెట్రిక్ పరీక్ష పూర్తి గాకుండానే గఫార్ ఖాన్ బ్రిటిష్ ఇండియా ఆర్మీలో చేరాయినయాడు. అయితే, ఆ పద్ధతులూ అవీ నచ్చక, ఉద్యోగం విరమించుకు, 'ఖుదాయ్ ఖిద్మత్ గార్' అనే ప్రజాహిత సంస్థను ప్రారంభించాడు. దశసూత్రావళికి లోబడ్డవారే యిందులో సభ్యత్వానికి అర్హులు. ఇతరులకు కష్టం కలిగించకుండా వుండటం, దుష్ప్రచారం చేయకుండా వుండటం, సాత్వికమార్గం, స్వాదికార నిరోధం, మతాతత్వానికి దూరంగా వుండటం, అనాచార నిర్మూలన, నిరాడంబర జీవనం, నిజాయితీతో జీవయాత్ర, సేవానురక్తి, సంఘవిధేయత.... చెప్పుకునేందుకు సామాన్యంగా వున్నప్పటికీ, ఆచరణలో అవి పర్వతారోహణవంటివి.., పశ్చిమోత్తరరాష్ట్రంలో బాద్షాఖాన్ మకుటం లేని మహారాజు - సరిహద్దు గాంధీగా పక్తూన్ ప్రజల హృదయాధినేత.... ఈ ఉపఖండ విభజన జరుగుతుందని ఆయన కలలో కూడా అనుకోలేదు - గాంధీగారూ అనుకోలేదు తన మాట ఖాతరు చేయరని! కాని చరిత్ర మరోవిధంగా నడిచింది.... ఆఫ్ఘన్ నేలలో నిదురిస్తున్న భారతరత్న ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్, మన స్వాతంత్రోద్యమ మహానాయకులలో మేరునగధీరుడు. ☀



అహంవల్ల ఏర్పడే అంధకారం, అసలు చీకటికంటె కడుదట్టమైనది.

—గాంధీజీ

ఆ యువకుడు తలపంకించి, కళ్లు తిప్పి, ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు.

అతను తిన్నగా న్యూయార్కునుంచి వచ్చాడట. ఈ పనికోసమనే, యింత ఎండాకాలంలో, అంత దూరం నుంచి వచ్చాడట. "మళ్లీ మరొకసారి రావడం ఎక్కడ కుదురుతుంది?" - అన్నాడు. ఎబిసి వారు ఏ పత్రిక ఎన్ని కాపీలు అమ్ముతుందో, నిజమైన లెఖ్ఖలు చూసి, సర్టిఫికేటు యిస్తారు. ఆ సర్టిఫికేటు పత్రిక పాలిట శ్రీరామరక్ష.

"మీ సర్క్యులేషన్ కార్డులు చూడనివ్వండి" అన్నాడతను.

చందాదారుల కార్డులు నాలుగైదు అతని చేతికిచ్చి - మా భార్యా భర్తల మిద్దరం రాత్రింబవళ్లూ కష్టపడుతూ, ఈపత్రికని నిలబెడుతున్నాం - అన్నాను. కష్టం ఎక్కువై, ఆరోగ్యం చెడటంవల్ల, విశ్రాంతి తీసుకునేందుకు బాబ్ వెళ్లాడని కూడా చెప్పాను.

చందాదారుల కార్డులవంక చూసి, అతను విచారంగా మూలిగాడు. సంపాదకీయం తొందరగా పూర్తి చేయాలనే ఆందోళనలో నేను వున్నాను.

"ఇటు చూడండి" అన్నాడు ఆ ఆడిటర్.

కార్డువంక చూశాను. కార్డుకి ఎడమ తలకట్టు వైపున పేరూ, యడ్రసూ, తేదీ ఉన్నాయి. తేదీ అంటే ఏనాటితో చందా అయిపోతుందో ఆ తేదీ. అందులో పొరపాటుఏమీనాకు కనపడలేదు.

"కార్డుమీద ఆ పెన్సిల్ మార్కులేమిటి?" అన్నాడు.

## నేషనల్ సిటిజన్ టి వి కె శాస్త్రి

కరుణామూర్తి మదర్ థెరిసా, 'గోల్డెన్ గేట్' విక్రమ్ సేఠ్, జస్టిస్ భగవతి, సోషల్ వర్కర్ సునీల్‌దత్, ప్లానింగ్ కమిషన్ మన్‌మోహన్‌సింగ్, 'తమస్' గోవింద్ నిహ్లానీ మున్నగు వారితో మా టి వి కె శాస్త్రి - మద్రాసు తెలుగు అకాడమీ, భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీల ప్రధాన కన్వీనరు - నేషనల్ సిటిజన్స్ అవార్డు అందుకుంటున్నారంటే, మా కెంత సంతోషంగా ఉందో చెప్పలేము. ఇరవైయొక్క మంది ఈ అవార్డ్ అందుకుంటున్నారు. పైన పేర్కొన్న ఆరున్నొక్కరూ గాక మిగతా పధ్నాలుగురు: దివంగతులైన స్మితాపాటిల్, ఆర్టిస్టు తాజిస్ట్ సలీమ్ అలీ; ఆ తర్వాత, ప్లానింగ్ కమిషన్ మెంబరు అబిద్ హుస్సేన్; పార్లమెంటేరియన్ నారాయణ్ చంద్ పరాశర్; చెస్ ఛాంపియన్ ఆనంద్; పోర్ట్ అథారిటీ చైర్మన్ యన్ కె సింగ్; భారత్ హెవీ ఎలెక్ట్రికల్స్; పోలీసు కమిషనర్ వేద్ మార్వా; అభయ్ ఓస్వాల్; హెూమియోపతీ దివాన్ హరీష్ చంద్; జర్నలిస్ట్ భట్టాచార్య; మాలిక్యులర్ బయాలజిస్ట్ భార్గవ; ఫిజిక్స్ ప్రొఫెసరు యస్పి జైన్; సంగీత దర్శకుడు భూపేన్ హజారికా.... న్యూఢిల్లీలోని నేషనల్ సిటిజన్స్ కమిటీకి అధ్యక్షులు ఆదిష్ అగర్వాలా.

"సాయుధ ప్రచారం"అనేది విమోచనోద్యమ పోరాట తంత్రంలో ఒక ప్రత్యేక విభాగంగా బ్రెజీలియన్ అమరవీరుడు కార్లొస్ మార్ఘెల్లా పేర్కొన్నారు.

విప్లవ ప్రజానీకం, వారికి అగ్రగాములైన విప్లవకారుల సాయుధచర్యలను, వాటిలక్ష్యాలను, ప్రత్యేకించి ఆయాసందర్భాలలో వాటిని గైకొనడానికిగల కారణాలను, ప్రజల త్యాగనిరతిని, ధైర్యస్థయిర్యాలను, ప్రజాతశత్రువుల దుశ్చర్యలను విశదం చేయడమే సాయుధప్రచారం ఉద్దేశం.

మామూలుగా దొంగలు, దోపిడీగాళ్లు, నేరస్తులుచేసే చర్యలనుసైతం విప్లవ కారుల చర్యలుగా పాలకవర్గం ప్రచారంచేసే అవకాశం ఉన్నది. అదీగాక విప్లవ ప్రతి ఘాతశక్తులు దుశ్చర్యలు జరిపి వాటిని విప్లవకారుల చర్యలుగా ఆపాదించే ప్రమాదం ఉన్నది. ఈవిధంగా రెండుమార్గాలలో విప్లవకారులను ప్రజలదృష్టిలో న్యూనత పరిచి ఏహ్యభావం కల్పించడానికి యత్నాలు జరగవచ్చు. విప్లవానికి మిత్రులైనవారు ప్రత్యేకించి ప్రచారనైపుణ్యం, రచనాసామర్థ్యం కలవారు తమ రచనలద్వారా అట్టి యత్నాలను ఎదుర్కొనవచ్చు.

అందుచేత సాయుధచర్యల్లో ప్రతిఒక్కదాని విషయంలోను ప్రచారం అవసరం. విప్లవకారుల చర్య అయితే ఆ విషయం ప్రకటించాలి. వారికి సంబంధం లేకపోతే ఆ విషయంకూడా వివరించాలి. పాలకవర్గం ప్రజలపైన, విప్లకారులపైనజరిపే అత్యాచారాలను వర్ణించాలి దీనినే సాయుధప్రచారమని మార్ఘెల్లా సూత్రీకరించారు.

సాయుధప్రచారాన్ని రెండుతరహాలుగా విభజించవచ్చు. రాజకీయదృక్పథంతో కరపత్రాలు, పత్రికావ్యాసాలరూపంలోసాగే ప్రచారం ఒక తరహాకుచెందినదైతే, ఆ విషయాలనే సృజనాత్మక శిల్పంతో ప్రజలగుండెలపై హత్తుకొనేటట్టుగా వివిధసాహితీ రూపాలలో చిత్రించడం రెండవతరహాకుచెందినది. రచనాశిల్పంతోకూడిన సాయుధ ప్రచారమే సాయుధకవిత్వమని చెప్పవచ్చు.

సాయుధకవిత్వంగా పరిగణించతగిన రచనలు ఇంకా శైశవదశలోనే ఉన్నాయి. ఇప్పుడిప్పుడే అట్టి ప్రయత్నం జరుగుతున్నది. సాయుధకవిత్వానికి "తిరుగబడు" ఒక విధంగా నాందివంటిది. పోరాడవలసిందన్నఉద్బోధ దానిలో ప్రధానమైనది. సాయుధ పోరాటం జరుగుతుందన్నదశ ప్రభావం ఆ రచనలో అంతగా కానరాదు. ఇటీవల వెలువడిన "మార్చ్" సంకలనం మరికొంత ముందంజవేసినది.

ప్రజలు సాయుధులై పోరాటం జరిపేదశలో హింస, జననష్టం అనివార్యమౌతాయి. విధ్వంసక చర్యలు తప్పనిసరి అవుతాయి. అందుచేత వాటిని సమర్థిస్తూ సూటిగా సాహితీ రూపాలలో చిత్రించడం అవసరం. ప్రజల త్యాగాలను, ఆత్మబలిదానాలను మహోజ్వలంగా కీర్తించాలి. ప్రజాకంటకులైన పాలకవర్గ బలగపు రాక్షస కృత్యాల నగ్న స్వరూపం చాటిచెప్పాలి. పోరాటపథానఉన్న ప్రజలకు వెన్నుచరచి ఉత్తేజంకలిగించేరీతిలో ప్రబోధాత్మక పాత్రను సాయుధ ప్రచార సాహిత్యం నిర్వహించాలి.

విప్లవపోరాటాలనుజరిపే ఉద్యమ శక్తుల మాదిరిగానే విప్లవ సాహిత్యోద్యమం కూడా వీలైనంత మేరకు అజ్ఞాతపంథాను అనుసరించడం చాలాముఖ్యం. విప్లవ సాహిత్యోద్యమసంస్థ, దాని ప్రచారసాధనాలను అజ్ఞాతంగానే ఉంచుకొని కాపాడుకోవాలి.

-శివకుమార్.

మినీ విమర్శ :

# అంపశయ్య

ప్రయోగం ఒక పిచ్చి. ఏ పిచ్చి అయినా అభ్యుదయ వ్యతిరేకం, ఏదీ అందరికీ అర్థంకాని మాట నిజం. కానీ వీలయినంత ఎక్కువ మందికి అర్థమయేటట్లు రాయటానికి ప్రయత్నించటం అభ్యుదయ రచయిత విధి. పాడితుల, పీడితులపక్షిన శాస్త్రీయంగా నిలబడ్డ రచయితకి ప్రయోగ చాపల్యం ఉరితాడు, చైతన్యం స్రవంతి, మనస్తత్వశాస్త్రాన్ని సాహిత్యంతో సమన్వయింప చూసిన వికార మేధావుల కృత్రిమ కల్పన. అంపశయ్య ఆ కృత్రిమ వికార అనభ్యుదయ ప్రయోగానికి శిశువు. ఈ నవలలోని ప్రధాన అభ్యుదయ వాతావరణం 18 గంటలలో అందులోను చైతన్య స్రవంతిలో యిమడటం అసాధ్యం, తాను చెప్పదలుచుకున్న ప్రధాన భావాన్ని జాగ్రత్తగా నిర్మించుకుని దాన్ని 18 గంటలలో జరిగిందని వర్ణించటం చైతన్య స్రవంతి శిల్ప విరుద్ధం. అభ్యుదయ రచయితలు తప్పనిసరిగ బూర్జువా ప్రయోగాల సుడిగుండంనుంచి బయటపడితీరాలి. అంపశయ్య చైతన్య స్రవంతి ప్రయోగమూ కాదు. శాస్త్రీయమైన అభ్యుదయ దృక్పథము ప్రతిపాదించేదీ కాదు. నవీన్ సాధారణంగా నిరాడంబరంగా మరొక నవల వ్రాస్తే... స్వాగతం.

—త్రిపురనేని మధుసూదనరావు.

# దిగంబరకవుల పరస్పర విమర్శలు నిజాయిజాల మంచి చెడ్డలు

దిగంబరకవులు చీలిపోయారు. జ్వాలాముఖి నాయకత్వాన ఐదుగురు మహా స్వప్నపై ఛార్జిషీటు అని విమర్శపెట్టారు. మహాస్వప్న సమాధానం యిచ్చారు. ఐదుగురిలోకూడా భైరవయ్య స్థానమేమిటో అర్థంకాకుండా వుంది.

ఐదుగురి ఛార్జిషీట్, మహాస్వప్న సమాధానమూ ఆసక్తిదాయకంగా ఆలోచనా ప్రేరకంగా వున్నవి తెలుగు కవిత్వధోరణులనూ సాహిత్య సంబంధంగా వుంటున్న రాజకీయ నూతన ధోరణులనూ అనుసరిస్తున్న వారందరూ తప్పక చదవాల్సిన వ్యాసాలివి.

జ్వాలాముఖి వర్గీయులు Committed ideolog cal trendలో వున్నారు మహాస్వప్న వున్నది Uncommitted intellectual trend

ఇలా రెండు ధోరణులుగా విడిపోవటం ఆ రెండు ధోరణుల సిద్ధాంత రాజకీయ సాహిత్య చర్చగానే వాగ్వివాదం సాగటమూ వారికీ అందరికీ ఉపయోగ కరమైనదిగా వుంటుంది.

కాని యీ చర్చలో ఆ విధం కన్పిస్తున్నా పూర్తి ఆరోగ్యకరమైన అలాటి చర్చ గానేగాక, వారివారి ప్రస్తుత పొజిషన్స్‌ని వివరించుకొనటమూ ఎదటి పక్షపు భావాలను విమర్శించటమూగానే గాక, యితరమైన తప్పు పద్ధతులు ముఖ్యంగా జ్వాలాముఖి వర్గీయుల్లో వచ్చినవి.

అసలు దిగంబరకవులం మే మే. మహాస్వప్న వదిలేశాడు. జారిపోయాడు పైగా దిగజారిపోయాడు అనే విషయంగానే ఎక్కువ తీసుకొచ్చారు. ఐదుగురు సంఖ్యా బలం మెజారిటీ గావటంవల్ల అలానే అనిపించే అవకాశమూ వున్నది.

మరి యిది నిజమా?

దిగంబర కవితగా అవిర్భవించింది ఒక సిద్ధాంతానికో ఆశయ జాలానికో కట్టు బడిందికాదు. పైగా అన్ని యిజాలమీదికీ ధ్వజమెత్తినది కనుకనే దిగంబరం అన్నారు.

అన్ని రాజకీయాలనూ సిద్ధాంతాలనూ మతాలనూ పడదోసి మానవుణ్ణి దిగంబరంగా నిల బెట్టడమే దిగంబర కవిత ప్రత్యేకత.

అలాంటి దిగంబర కవుల్లో నలుగురు నేడు స్పష్టంగా సామ్యవాద విప్లవ కవులయారు. విప్లవ రచయితల సంఘ సంచాలకులయారు. మార్క్సియన్ సామ్యవాదమే ధ్యేయంగా ప్రకటించుకుని మావోయిజమే నేటి మార్క్సిజంగా విశ్వసిస్తున్నారు. ఆ రకంగా ఒక యిజమూ ఒక విశ్వాసమూ ఒక లక్ష్యమూ ఏర్పరచుకొన్న వారయారు.

ఇది చాలా చెప్పుకోదగ్గమార్పు. మామూలు Quantitative మార్పుకాదు, Qualitative (గుణాత్మక) మార్పు. ఈ మార్పుకు చాలా ప్రాధాన్యతవుంది. ఒక్క మాటలో చెప్పాలంటే దిగంబర కవులల్లా సాయుధ విప్లవ కవులుగా రూపాంతరం పొందారు. ఈ మార్పుయొక్క గుణాత్మకతనూ నిర్మొహమాటంగా ఖచ్చితంగా అర్థం చేసికొన్నపుడే ఎవరైనా యీ చర్చలో సరిగా పాల్గొనగల్గుతారు. పైగా ఈ విషయాన్ని మార్పును జ్వాలాముఖి వగైరాలు ఆత్మపరిశీలనతో అవగాహనచేసుకొని అంగీకరించి తీరాల్సి వుంటుంది.

అందుక్కావాల్సిన ఆత్మవిమర్శా దృష్టి, ధైర్యం, వినయం జ్వాలాముఖి వగైరాలకు లోపించటంవల్లనే యీ చర్చ, సంవాదం జరగాల్సినట్లు తేటతెల్లంగా విస్పష్టమైన సిద్ధాంత ఆదర్శాల చర్చగా జరక్క అనవుసరమైన అభ్యంతరకరమైన గంద్రగోళ పరచే పద్ధతికి తావిచ్చింది.

Uucommitted, intellectual జుగుప్సాకరమైన rebellious కవిత్వం దిగంబర కవిత్వం. ఇవాళ్టికీ మహాస్వప్న అలానే వున్నాడనేది వివాదానికాస్కారం లేకనే అంగీకరించాల్సిన విషయం.

జ్వాలాముఖి వగైరాలు యివాళ revolutionary ideoiogy and politice కు Commit అయిన కవులు.

ఈ మార్పువల్ల జ్వాలాముఖి వగైరాలు దిగంబర నామం వదలి విరసంలో పూర్తిగా సంలీనం గావటం formal గాకూడా జరగాల్సినసంగతి. [జ్వాలాముఖివగైరా నలుగురు కవులు వి.ర.సం.లో తమ విప్లవ కమిట్‌మెంట్‌తోనే చేరారుగాని దిగం బర కవులుగా చేరలేదు. అయితే విశ్వనాథశాస్త్రి, రమణారెడ్డివంటి పేర్లకు ఉన్న ప్రయోజనం ఎలాంటిదో యిపుడిక నగ్నముని, నిఖిలేశ్వర్‌వంటి పేర్ల ప్రయోజనం కూడా అలాంటిదే. దిగబర కవులూ తిరుగబడు కవులూ వి.ర.సం.లో చేరినవారు

యికనుంచి విప్లవ రచయితలుగా మాత్రమే గుర్తింపబడుతారు. సం॥] అలా జరక్క విరసంలోకూడా దిగంబర గ్రూపును నిలుపుకొనటం, పైగా దిగంబరకవులం తామేగాని మహాస్వప్న కాదనటం రెండువైపులకు హానిచేయటం అవుతుంది. ఒకప్రక్క విరసం యొక్క ఏకీకృత సర్వతోముఖాభివృద్ధికీ, రెండవ ప్రక్క మహాస్వప్నను పీటీమన్ను చేసి దుర్బలుణ్ణి చేయటానికి దోహదకరం అవుతుంది. ఇది అన్యాయం పైగా నీతి బాహ్యముకూడా.

ఇలాటి ఆత్మవిమర్శా రహిత ధోరణివల్ల జ్వాలాముఖి వగైరాలు మొదటినించి నేటివరకూ వారి ఆలోచనా ధోరణి, రచనలు అన్నీ విప్లవ రచనలే సరైన మార్క్సిస్టు రచనలే అనే వాదానికి అహంకారానికి దారితీసి, వారి గత రచనల ధోరణుల లోపాలను గురించి, దిగంబర ఉద్యమాన్ని గురించి కరెక్టు మార్క్సిస్టుల లెనినిష్టు అంచనాకు రాలేకపోతారు. అలా ఆత్మ విమర్శతో నిర్ణయానికి రాలేకపోవటం విరసం అభివృద్ధికి, వారి సిద్ధాంత పురోగమనానికీ నష్టం చేసుకొనటం అవుతుంది. పైగా మహాస్వప్న లాంటివారిని సరైన తర్కంతో మార్క్సిస్టు హేతువాదంతో విమర్శించి వేరేదారిన వుంటున్న చాలా మంది intellectual young writers ని. మార్క్సిస్టు విప్లవ పథానకు మళ్ళించలేకపోతారు.

అలాటి ఆత్మవిమర్శా రహిత, సవినయ సిద్ధాంత అవగాహనా లోపంవల్లనే మహాస్వప్నను ఓడించటం. దిగంబర గ్రూపు నిలుపుకొనటం అనేవే లక్ష్యంగా తయారయి అవకాశవాదానికి దారిదీయటం జరుగుతున్నది భైరవయ్య వివాహం మొదలైనవి. నగ్నముని తిరుపతి దర్శనం యీ సందర్భంగా చిన్న విషయాలుగా అనుకొనటం రాజీ పడటం జ్వాలాముఖి వగైరాలు ముందుబడుతున్న ఉద్యమాలకెంతో హానికరం.

తాము ఒకనాడు uncommitted అని ఛాజాలు వాయించుకొన్నవాళ్ళమే అనీ గుర్తించగల్గిన్నాడే తమ Paint of view లోకి తామెలా మారిందీ గుర్తించగల్గితేనే నేడు మహాస్వప్నలాంటివారి నిజాయితీని sympathetic గా అర్థంచేసుకొని నచ్చచెప్ప ప్రయత్నిస్తారు. ఇందుకోసం జ్వాలాముఖులు చాలా మారాల్సివుంది.

ఒక సిద్ధాంతానికి కట్టుబడినవాళ్ళలో వుండే బలం వేరు. ఏ యిజానికీ కట్టుబడని వారిలో వుండే బలంవేరు. ఈ రెండు బలాలు యీ ఉభయుల వ్యాసాల్లోనూ స్పష్టంగా కన్పిస్తుంది.

"మీకో యిజం వుంది. మీదేజయం పురోగమించండి. చరిత్ర నిండా మీలాటి వాళ్ళ విజయాలే కన్పిస్తయ్" అని మహాస్వప్న అన్నదాన్లో నిజమేవుంది. చరిత్రలో

గెల్చినవాళ్ళు అందరూ గొప్పవాళ్ళు మంచివాళ్ళు అనేదానికిలేదు. మావైపే సత్యం వుందని మొండిగా నమ్మి తెగించి నడిచినవారికి జయం వచ్చింది అనేది అందులో హంశం ఆ బలం వారికుంది.

కాని రెండవ ప్రక్కన దిగంబరకవులందరూ ఏకగ్రీవంగా యింత ప్రభావం కలుగజేయటానికి ముఖ్యకారణం ఏ యిజానికీ కట్టుబడని వారి నిష్పాక్షిక విశృంఖలతే. ఇదే కట్టుబడనివారి బలం.

అందువల్ల కట్టుబడనివారి బలాన్ని గొరికుండే శక్తినీ తక్కువ అంచనా వేయలేదు.

ఇపుడు మహాస్వప్న సమాధానంలో మార్క్సిజం వందసంవత్సర సం॥ల నాటిదని పుచ్చిపోయిందని తీసి పారేస్తూ రాశారు. ఇది మహాస్వప్న పునర్విమర్శించుకొనాల్సిన విషయం. స్వవచన వ్యాఘాతం. వారి రెండవ (దిగంబర కవిత) సంచిక ఉపోద్ఘాతంలో 'దారిద్రం, అర్థిక అసమానత భూమ్మీద వున్నంతకాలం మార్క్సి జానికి ఎదురులేద'ని ఘంటా పథంగా వ్రాసి చెప్పారు. ఆ ఉపోద్ఘాతంతో ఆ రెండవ సంచికతో మహాస్వప్న పూర్తిగా తాదాత్మ్యతలోనే వున్నట్లు ఆయనే అంగీకరించారు. అలా అయినపుడు యీ పైమాటలు ఆయనవికూడా కావాలి. మరి యీ నాడు మారి నట్లా? జ్వాలాముఖిమీద కోపంతో మార్క్సునే కాదనే స్థితికి పోవటం తనమాటలనే తాను కించపరచటం శోచనీయమూ తన్ను తా నీచపరచుకొనటమున్నూ. జిడ్డు కృష్ణ మూర్తి 40 ఏళ్ళనాడు చెప్పిదే యివాళ చెబుతున్నారు. అందువల్ల అవి 40 ఏళ్ళనాటి మాటలుగా పనికి రానివికావు. మార్క్సు 100 సం॥లనాడు చెప్పటం disqualification కాదు. ఏనాడు పుట్టి ఏ శతాబ్దంలో చెప్పిన వాడయినా కావాల్సింది ఏమి చెప్పాడు ఎలావర్తిస్తుంది ఎలా నిజమవుతున్నది అనేది. అందరిలాగా Fashionable గా మాట వదిలేలేయటం తను సమాధానం చెప్పదలచుకొన్నవారి వలలో పడటమే అవుతుంది. తన్ను తా మరచిపోయే ఆవేశం నష్టం.

అన్వేషణ, చింతన అనుశీలనలను దూరం చేయని Commitments వుండొచ్చు అనేది మహాస్వప్న ఆలోచించవలసిన విషయం, అన్వేషణ, స్పందన, చింతనలకు Commitment లేకపోవటం మార్గం మాత్రంకాని సిద్ధాంతానికి కట్టు బడక పోవటమే లక్ష్యంకాదు. uncommitted గా వుండాలనేది తాపత్రయంగా తయారయితే అన్వేషణ ముగిసి, అనుశీలన అంతరించుతుంది.

Not to Commit అనేదే వ్యసనమై ఆవ్యసనాన్ని కాపాడుకొనటమే Vested interestగా తయారయి నిజమైన నిష్పాక్షికతను, objectivityని సరైన అన్వేషణను లేకుండా చేసుకోవటమే అవుతుంది.

అసమానమైన అన్యాయ సామాజిక పరిస్థితుల్లో మౌలిక మార్పును total change ని కొనసాగించే ప్రయత్నంలో తమ్ముతా అత్మార్పణ చేసుకొని పోరాడే వ్యక్తుల్లో శక్తుల్లో ఏ నిజంవుందో ఏ యిజంవారినలా చేస్తున్నదో గమనించగల్గి ఆ శక్తులను మనసారా అభినందించి ఆశీర్వదించటంకూడా కట్టుబడిపోవటం అనుకొంటూ అలాటి కట్టుబడికూడా అపవిత్రమే అనుకుంటే ఆ uncommittal పద్ధతికి అర్థమేలేదు అనొక regid notion తప్ప. నిజమైన కట్టుబడనిస్థితి సరైన విప్లవ కార్యాచరణకు దారి తీసేది అవుతుంది. మహాస్వప్న కట్టుబడని తత్వం Fashion కాకూడదు.

—అట్లూరి రంగారావు.

## జాగత!

గద్దెయెక్కి— వుపన్యసిస్తున్నారే—
వాళ్ళే నీ గుండెకు గాయంచేసి
నీవిచ్చిన ఓటు కౌగితంతోనే 'స్ట్రా' చేసి
దాని చివర్న హిపారిన్‌పూసి
నీ గుండెలోదించి
రక్తాన్నంతట్నీ పీల్చేస్తారు.
అది నీ రక్తంలోని,
ఫైబ్రినోజిన్‌ను చంపేసి
నీ రక్తం చివరిబొట్టుకూడ
కారిపోయేలా చేస్తుంది
జాగ్రత్త!

# ముమూర్ష

ఆదివారం, ఉదయం ఆరు గంటలు

నిన్న చచ్చి ఇవాళ పుట్టాను. పునర్జన్మ అంటే ఇదేకాబోలు. సచ్చేకలలే స్వర్గ నరకాలు కాబోలు. నిద్రలో ఈ 'నేను' ఎక్కడికి వెళ్ళింది? చావంటే దీర్ఘనిద్రా?...

నిన్ననే ఉద్యోగానికి రిజైను చేశాను.

'నీతి న్యాయం అనేవాడికి నీకుద్యోగం ఎందుకు? అలా ఏడవబట్టే అయిదేళ్ళ బట్టి నీ సీటు మారలేదు' అన్నాడు ఇంజనీరు.

వాడు రికమెండ్ చేసిన బిల్లు పాస్ చెయ్యలేదు.

రాజీనామా కాగితం వాడి ముఖాన విసిరి బయటకు వచ్చాను.

నాకు ఇంకేం బంధాలులేవు. పడిపోతున్న యీ మేడమీద గదితప్ప! ఇంటి ముసిలిది పాలమనిషిమీదకాబోలు కేకలేస్తూంది. అదిచ్చే నీళ్ళకు ఇదిచ్చేడబ్బుకు చెల్లు.

'RAJA RAO SICK START IMMEDIATELY'

టెలిగ్రాం వచ్చి అరగంటయింది.

ఈ పాటికి వాడు చచ్చి ఉండవచ్చు.

ఇప్పటికి ముప్పదిఐదు సంవత్సరాలు నిండాయి. బ్రతుకు మీద రోతతో రోజూ బ్రతికేస్తున్నాను. రాజారావు చచ్చిపోతే అదృష్టవంతుడు. గోడమీద సాలెగూడు. దాంట్లో ఈగ గిలగిలా కొట్టుకుంటున్నాది. దానికి విముక్తి ఎప్పుడో?...

వీధిలోకి బయలుదేరాను. ఇంటిదానికి ఎవరు చెప్పారో? అప్పుడే "ఇవాళ సాయంత్రం అద్దె ఇచ్చెయి నాయినా" అంది. దానికి యెనభై ఏళ్ళు. ఎవరూలేరు. ఈ డబ్బంతా ఏంచేస్తుందో. జన్మలో సుఖపడి ఉండదది.

వీధిలో ఒంటరిగా నడుస్తున్నాను. ఆఫీసులో పనిచేస్తున్నప్పుడు చాలామందికి నా అవసరం ఉండేది. ఇవాళ అదీలేదు. నాకింకెవరితోను సంబంధంలేదు. ఇంటి దానితో తప్ప.

పేవ్‌మెంట్‌మీద ముష్టిది పిల్లలను పడుకోబెట్టింది. వాళ్ళు అప్పుడే బురదలోంచి వచ్చిన పందిపిల్లల్లాఉన్నారు. దానికి జాకెట్టులేదు. ఏవో గుడ్డపీలికలుఉన్నట్టున్నాయి. అవీ దాని ఒంటిరంగుతో కలిసిపోయాయి. దానికి ఒక కాలుమీద పైచర్మం లేదు. ఎర్రగావున్న ఆ కాలుమీద ఈగలు వాల్తున్నాయి. దానికి ఓచెయ్యిలేదు. రెండో కాలునిండా కురుపులే! అదిచస్తే ఎవరూ విచారించరేమో. అదిచస్తేనే బ్రతుకుతుంది. బ్రతుకంటే ఇంకా ఎందుకో అంతఆశ దానికి! దాన్నిచూస్తే వారంరోజులక్రింద తిన్న తిండికూడా వాంతి అవుతుందని చెప్పడానికి సందేహించక్కర్లేదు.

కోమల విలాస్‌లో మెస్‌లోకిపోయి ఒకమూల బెంచీమీద కూర్చున్నాను. నల్లగా మాసిన గోడలు, సర్వర్ బాగా వేడిగావున్న టీ తెచ్చి బల్లమీద పెట్టాడు. టీగ్లాసు ఒకప్రక్క పట్టుకున్నాను. రెండవప్రక్కనుంచిచూస్తే నావేళ్లు కనబడుతున్నాయి! ముందు గదిలో చూశాను. కాలేజీ అమ్మాయిలు కాబోలు నలుగురు టిఫిన్ చేస్తున్నారు. అందులో యిద్దరు బట్టలు ఎందుకు కట్టుకున్నారో తెలీదు! రోడ్డుమీద ముష్టిది లేకకట్టుకోలేదు. వీళ్ళకు వుండి ఏంఖర్మ? స్లీవ్‌లెస్ జాకెట్టు అమ్మాయి చెయ్యెత్తి ఏవో చూపిస్తున్నది తక్కినవాళ్ళకు. వాంతివచ్చినంతపనైంది. ఎర్ర చీర అమ్మాయి ఏదో ఆలోచిస్తున్నది. చేతిలో ఉత్తరంఉంది. బహుశా స్నేహితుడు ఎవరో రాసివుండవచ్చు. ఇంటిదగ్గిరనుంచి-వచ్చిందేమో, వాళ్ళింట్లో ఎవరికేనా జబ్బుగా ఉందేమో, వాళ్ళనాయినమ్మా, తాతో ఎవరైనా చచ్చిపోయారేమో? నాలుగోఅమ్మాయి నల్ల చీర, నల్లజాకట్టు కట్టుకొనిఉంది. చేతిలో 'The woman of Rome' మొరోవియాది కాబోలు ఉంది. సెంటు బాగా రాసింది. బహుశా మెన్సెస్ అయిందేమో? వాళ్ళ ఏ ఒక్కరిలోనూ ఆనందం వున్నట్టు కనిపించదు? వయస్సులు మహావుంటే 22కి మించవు. మరో ఏడాది రెండేళ్ళలో పెళ్ళిచేసుకొని పిల్లల్ని కంటారు. వాళ్ళకు కొద్దిదూరంలో ముగ్గురు కాలేజీ అబ్బాయిలు కాబోలు కూర్చున్నారు. ఈగపడ్డ కాఫీ యిచ్చాడని సర్వర్‌మీద కేకలు వేస్తున్నాడు వాళ్ళలో ఒకడు. అబద్ధం...వాడేఈగనుపట్టి చంపి కాఫీలోవేశాడు. బహుశా ఈ అమ్మాయిలు వాళ్ళప్రక్క చూడాలని కాబోలు. ముక్కోణం బూటులో అతని పాదాలు నలిగిపోతున్నాయి. ఇరుకు పాంటులో కాళ్లు ఇరుక్కున్నాయి. ఒంటిని చొక్కా సున్నంవేసినట్టు అంటుకొనిఉంది. అతని జన్మంతా తలలో ఉంగరాలు తిప్పడంతో సరిపోతుంది కాబోలు. వాళ్ళచేతుల్లో ఏవో పుస్తకాలు ఉన్నాయి. 'ఇవాళ లెక్చరర్ ఎపాలజీ యివ్వకపోతే స్ట్రైయిక్ తప్పదు' అంటున్నాడు టీషర్ట్‌వాలా. 'ఆఫీసు రికార్డులు తగలపెట్టాలి' అన్నాడు ఉంగరాలు. వాళ్ళను వాళ్ల తగలేసుకోకూడదా? వాళ్ళలో ఎందుకింత అశాంతి?——

టీ రాగడం అయింది వీదిలోకి వచ్చాను కొద్దిగా మబ్బుపట్టింది. ఆదివారం రావడంచేత దుకాణాలు ఏవీలేవు. జోడుతెగింది. తోడు ఎవరూలేరు. రాజమ్మపోయి ఎనిమిదేళ్ళయింది. అదృష్టవంతురాలు. చొక్కాపిన్నుతీసి జోడుకుట్టాను. చిన్న సందులోకి మళ్ళాను. అందులోంచి మరోసందు, ఎన్నో మలుపులు—

మేడమీద కిటికీలోంచి చూస్తున్న అమ్మాయి బావుంది!

లైబ్రరీకి వెళ్ళాను. గడ్డపాయిన లావాటి జాతకాల పుస్తకంలో లీనంఅయి పోయాడు. నిన్నటి బాధ, ఇవాళ సంగతీ అక్కర్లేదు. రేపటి మీద ఆశతో బతికేస్తాడు. వాంబెప్ కాలంలోంచి ఏదో రాసేస్తున్నాడు నిరుద్యోగి కాబోలు?

పేపరు తీశాను 'గుంటూరులో కారు ప్రమాదం, భార్యా పిల్లలను పోషించలేక మురుగన్ అనే అతను విషంపెట్టి చంపాడు మద్రాసులో, హైద్రాబాదులో పోలీసు ఫైరింగ్ ఇరవై మంది విద్యార్థుల మృతి.'

విసురుగా పేపర్ పడేశాను.

ఏదో పుస్తకంతీశాను. ఎవరో ఈవిడ? సలభైకిపైగా నవలలు రాసింది! నాలుగయిదు సినిమాలకు మాటలు రాసింది. పేజీలు తిరిగేస్తున్నాను.

వైర్‌లెస్ తీగెలమీద పిట్టలను చూస్తూ నిలబడింది రాధ. అప్పుడే పోర్టికోలో కారాగింది. శేఖర్ 'రాధా' అంటూ మేడమీదకు వచ్చాడు 'ఈ ముఖమల్ జాకట్టు, పెర్లిన్-సారీమీద రంభలా ఉన్నావ్' అన్నాడు శేఖర్. రాధ ముఖం వెయ్యి వోల్టుల బల్బులా వెలిగింది."

ఇంత దరిద్రంలోకూడా ఈవిడ కారులలో, మేడలలో బతికేస్తూంది! ఏం రాస్తున్నదో తెలీదు. పాఠకులను ఎందుకిలా చిత్రవధ చెయ్యడం? నిజజీవితంలో ఈవిణ్ణి మొగుడు వదిలేశాడట. ఏదో స్కూల్లో టీచర్‌గా పనిచేస్తూంది. పుస్తకం తగలెయ్యాలన్నంత కోపం వచ్చింది. పుస్తకం ఇచ్చేసి ఆలోచిస్తూ కూర్చున్నాను.

Frued Interpretation of Dreams కావాలండీ అని అడుగుతున్నాడు కౌంటరుదగ్గర ఎవరో యువకుడు.

రోజూ కనే కలలకు రూపాలు దిద్దుతాడు కాబోలు!

ఐదు నిమిషాలు తక్కువ పదకొండయింది. మరో అయిదు నిమిషాలలో లైబ్రరీ మూసేస్తారు పుస్తకాలు రిటర్న్ చేసేమంటున్నాడు ఎటెండర్! 'ఈ కథ పూర్తి చేసి యిస్తాను రెండు నిమిషాలాగు' అంటున్నాడు ఓపదహారేళ్ళ బాలాకుమారుడు. అట్టమీద ఆడబొమ్మ లాగు కట్టుకుంటున్నదో విప్పుకుంటున్నదో చెప్పడం కష్టం.

ఒంటిమీద పరేభాగంమీద గుడ్డ పీలికలులేవు. ఆ బొమ్మ చూడగానే అసహ్యం వేసింది. ముష్టిది జ్ఞాపకం వచ్చింది. వీధిలోకి వచ్చేశాను.

మార్కెట్టు జంక్షన్ దగ్గరకు వచ్చాను. పెద్దసినిమా వాల్‌పోష్టర్లు ఎత్తుగా ఉన్న గోడమీద అంటించి ఉన్నాయి. ముసలి సినీతార బొమ్మలు వాల్‌పోష్టరంతా పట్టేలా ఉంది! ఆ బొమ్మలమీద ఒకపిస్టల్ గురి చేయబడిఉంది. దానిని పట్టుకొని పొడవుగా సన్నగాఉన్న హీరోగారున్నారు. వారి ముఖాన పేడ దట్టంగా పులిమి ఉండటంచేత ముఖం కనబడటంలేదు. ఆడతార ముఖాన్న మీసాలు దిద్దిఉన్నాయి. పేడ పురుగుకన్న హీనంగా బతుకుతున్న కాళ్ళను చూసి జాలేసింది. వాల్‌పోష్టర్ చూడగానే కడుపులో త్రిప్పడం మొదలు పెట్టింది.

పొద్దుటినుంచీ ఏం తినలేదు. పన్నెండయింది. కాస్తకాలం గడపడానికి మీల్సు టికట్ట్సు తీసికొని అజంతా హోటల్‌లోకి వెళ్ళాను. కౌంటర్ దగ్గిర రేడియోగ్రాం పెద్దగా అరుస్తోంది.

"ము...ము...ముద్దంటే చేదా..." చాలా ఘోరంగా వినిపిస్తూంది. తరువాత ప్లేటు "ఇంద ఇంద లీసికో..." పాడడానికి దానికి సిగ్గులేకపోయినా వినడానికి చాలా అసహ్యంగా ఉంది. బట్టలు ఉన్న మనిషినిచూస్తే అందంగా కనిపిస్తుంది. బట్టలులేని మనిషిని చూస్తే అసహ్యంగా ఉంటుంది. చర్మం కొద్దిగా వలిచిచూస్తే వాంతి వస్తుంది. ముష్టిది జ్ఞాపకం వచ్చింది. దానికి కాలిమీద పైపొరలేదు. అన్నం సయించలేదు. వీధిలోకి వచ్చాను. మున్సిపల్ లారీ పెద్దగా రొద చేసికుంటూ వెళ్ళిపోయింది. కంపు భరించలేకపోయాను. హోటల్‌లో తిన్న భోజనానికి లారీలోఉన్న మలానికి ఎంత తేడా? బతికినవాడికి, చచ్చినవాడికి ఉన్నంత తేడా. "నేను"అనేది లేకపోగానే మనిషి కుళ్ళి కంపు కొట్టేస్తాడు. అసహ్యం అనిపించింది. కడుపులో వికారంగా ఉంది. ఎందుకు బతుకుతున్నారు జనం ఈ వికారంతో!...

ఆలోచనలు నాకేవస్తాయా? అది సహజమా? ఆలోచించనిదే ఏ పనిచెయ్యకు. ఆలోచిస్తే ఏపనీ చెయ్యలేవు. గోడమీద నిలబడి మేక ఆకులు తింటున్నాది. దానికి ఈ సమస్యలు, బాధలూలేవు కాబోలు. కుక్క ఒకటి ఎంగిలాకుమీద అన్నం తింటున్నాది. ఛీ! ఛీ! ఎందుకిలా బతుకుతారూ! తినకుండా చావకూడదూ!.

అయిదయింది. బీచీలో కూర్చున్నాను. వంటరిగా ప్రపంచ సరిహద్దులో ఉన్నాను. నీటిలో కాళ్ళుపెట్టి పెద్దరాయిమీద కూర్చున్నాను. పిల్లలు కొంత మంది ఇసకలో పిచ్చిక గూళ్ళు కడుతున్నారు. ఎవరో వాటిని ఏంచేయకుండా చూశారు.

# భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ

జాతీయ సమైక్యతా సాధన కోసం కృషి సల్పుతున్న భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీవారు తమ పద కొండవ సాంస్కృతిక కార్యక్రమాలను ఢిల్లీలో మూడురోజుల పాటు భారీ ఎత్తున నిర్వహించడానికి సర్వ సన్నాహాలు పూర్తి చేసుకున్నారు. మొదటి రెండు రోజులు - అనగా 1987 అక్టోబర్ 16, 17 తేదీలలో ఢిల్లీ టాల్‌కటోరా ఇన్‌డోర్ స్టేడియమ్‌లో జరిగే యీ వుత్సవాలు సంగీత, నృత్య కార్యక్రమాలతో నిండి వుంటాయి. ఇవి వియస్‌టి ఇండస్ట్రీస్ వారి సహాయ సహకారాలతో "Spirit of Freedom Concerts" అనే పేరుతో జరుగుతాయి. సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని విశ్వ మానవ సంక్షేమాన్ని, లలిత కళల ద్వారా పెంపొందించాలని దీక్ష పూనిన భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ, ఈ మహెూత్సవాలలో పాల్గొని తమ లక్ష్యసాధనకు తోడ్పడవలసిందిగా, సర్వశ్రీ పివి నరసింహారావు, జలగం వెంగళరావు, పి వెంకట సుబ్బయ్య, మాజీ రాష్ట్రపతి గ్యానీ జైల్‌సింగ్, బిడి జట్టి వంటి ప్రముఖ నాయకులను; డా॥ బాలమురళీ కృష్ణ, పండిట్ జస్రాజ్, డా॥ యస్. రమణి, హరి ప్రసాద్ చౌరాసియా, యస్‌పి బాలసుబ్రహ్మణ్యం, యస్. జానకి, యస్. పి. శైలజ వంటి ప్రముఖ కళాకారులను ఆహ్వానిస్తున్నారు.

16-10-87 - శుక్రవారంనాడు జరిగే శాస్త్రీయ సంగీత జుగల్‌బందీలో డా॥ యమ్. బాలమురళీ కృష్ణ, పండిట్ జస్రాజ్ ఢిల్లీలో మొదటిసారిగా ఒకే వేదికమీద తమ గాన మాధుర్యంతో అందరిని తన్మయులను చేస్తారు. కర్నాటక సంగీతంలో ఒకరు నిధులైతే, హిందుస్థానీ సంగీతాన్ని కాచి వడపోసిన వారు మరొకరు. ఈ ఇరువురూ పాల్గొనే యీ జుగల్‌బందీ విశేషాకర్షణగా- ఉంటుందని చెప్పనవసరం లేదు.

17-10-87 - శనివారం నాడు - వేణుగానంలో జుగల్‌బందీ - సంగీత ప్రపంచానికి చిరపరిచితులై తమ వేణు వాదనంతో రసజ్ఞులను మంత్ర ముగ్ధులను గావించే శ్రీ హరిప్రసాద్ చౌరాసియా- హిందుస్థాని సంగీత పద్ధతిలోను, డా॥ యన్ రమణి- కర్నాటక సంగీత పద్ధతిలోను.

ప్రముఖ కథక్ నృత్య కళాకారుడు బ్రిజ్ మహారాజ్ వంటివారి ఆశీస్సులు పొందిన, 'ఢిల్లీ కథక్ కేంద్ర' బృందం వారిచే కథక్ నృత్య కార్యక్రమం ఈ ఉత్సవాలలో ఉంటుంది.

ఢిల్లీలో జరిగే యీ సాంస్కృతికోత్సవాలకు సర్వశ్రీ జలగం వెంగళరావు. కేంద్రపరిశ్రమల మంత్రివర్యులు, పాట్రన్‌గాను, కె. పరాశ

ఏమిలేదు, ఏమిలేదు—ఏమిలేదు—

ఇంకా బ్రతకడం ఎందుకు ?

ఈ ఎలకలమందు పుచ్చుకుంటే—

రేపు ఉండదు.

ఇంటి ముసలిదే తగలెయ్యాలి.

ఛీ! ఛీ! కుళ్ళి కుళ్ళి ఈ రోగాలతో చచ్చేబదులు ఒక్కసారి చచ్చిపోకూడదూ:

రేపు ఎలా?

ఉద్యోగంలేదు!

తిండిలేదు.

బతకాలన్న ఆశ పూర్తిగా హరించిపోయింది.

చచ్చిపోవడంలోవున్న సుఖం ఎక్కడాలేదు.

రాజారావు చచ్చిపోయుండాలి.

పావలాఇచ్చి ఎలకల మందు కొన్నాను.

ఇవాళ ఇది పుచ్చుకొంటే—

రేపు,

ఈ "నేను" ఎక్కడో?...

కరెంటుకూడా నీకెందుకని ఇంటి ముసిలిది తీయించేసింది. కొవ్వొత్తి వెలిగించాను. గదిలో నీడలు చాలా భయంకరంగా ఉన్నాయి. సగం విరిగిన కిటికీలోంచి నక్షత్రాలు కనబడుతున్నాయి. నేలమీద ఓ పక్క చీమలపుట్టవుంది. ఏదో జంతువును చంపి పుట్టలోకి తీసుకువెళ్తున్నాయి. గోడమీద హిరణ్యాక్షుని చంపుతూన్న నరసింహస్వామి బొమ్మవుంది. అది తియ్యమని ముసలిదానికెన్నిసార్లు చెప్పినా తియ్యదు. ఆ బొమ్మను ఏంచేసినా దానికి నరసింహస్వామి పూనుతాడు. ఆ బొమ్మ అక్కడఉండటం ఇష్టంలేకపోతే యిల్లు ఖాళీచేసి వెళ్ల అంటుంది. మనిషి మనశ్శాంతి కోసం దేవుణ్ణి సృష్టించాడు కాబోలు. కాని ఇంత అశాంతి ఏమిటో?

కొవ్వొత్తి మరో అయిదు నిమిషాలకన్నా ఎక్కువ వెలుగదు. ఈఇప్పుడిఐదు ఏళ్ళలో నేను సాధించినది ఏమిటి ?

పొందిన ఆనందం ?

అనుభవించిన సుఖం ?

తను తగలడితే మిగిలేది బూడిద,

కర్ర మంటవెడితే బూడిద అవుతుంది.

అదే కర్రగావుంటే ఎన్నో ఉపయోగాలు. నానాచిత్రవధలకుగురై కుర్చీగానో, బల్లగానో ఏదో ఓ అకారం ధరిస్తుంది.

టైం చూసాను.
ఐదునిమిషాలు తక్కువ పన్నెండు దగ్గర వాచీ ఆగిపోయింది.
కొవ్వొత్తి ఆరిపోతున్నాది—ఆరిపోయింది.
వెలుగు ఏమయింది ?
ఇంత సేపు మండిన మంట ఏది ?
చీకటి:
చీకటిలో నేనొక్కడిని,
నాగదిలో మంచంమీద పడుకొని ఆలోచిస్తున్నాను
"ఎలకల మందు తినడమా: వద్దా?"...అని—

[illegible]

## తప్పుకో!

బిక్కచచ్చిన మనిషీ
నీ సర్వస్వం ధారపోసి
నిండుగా మేపి
అందంగా అలంకరించిన-
నాయకులెందరో
మత్తుగా ఖుషీగా కూర్చున్న రథాన్ని
ఠీవిగా పైకిచూస్తూ
దర్పంగా అడుగులేస్తూ
వేగంగా లాక్కొస్తున్న గుర్రం
నీ బక్కచిక్కిన డొక్కల్లో
ఇనుప డెక్కల ముద్రలేసి
దర్జాగా వెళ్ళిపోతుంది
చూస్తావేం
తప్పుకో!

# వారసుడు

"ఏయ్...నిన్నే...సరోజా...లే...తెల్లవారబోతోంది"

"ఊఁ...అబ్బ...ఆఁ...

ఆమె ముద్దుగా. చిరుకోపంతో, కళ్ళింకా మూసుకునే అన్నది. "అబ్బ నిద్ర పోనిద్దూ."

"లేదు మనం వెలుగు రాకుండానే వెళ్ళాలని తెలీదా" అన్నాడు. ఆమె సమాధానం చెప్పకుండా ప్రక్కలో అటు, ఇటు పొర్లి తిరిగీ నిద్రపోయింది. రాజు ఆలోచిస్తూ పడుకున్నాడు. అతడికి ఎంతో అలసటగావుంది. హాయిగావుంది. చాలాసార్లు యిలా ఈ హాయిని డబ్బుతో కొన్నాడు. సరోజకూడా ఏమీ అసూయసకు రాలుకాదు. పొట్టమీద వాతలే సాక్ష్యం. కాలేజీ ఆడపిల్లలు అనుకున్నంత అమాయకురాలేంకాదు. అయినా ఆమెతో ఏమిటో బాగుంటుంది. ఆమెఅంటే యిష్టంతనకు, ఆమెను ప్రేమిస్తున్నాడా? చ... దేవుడు, మతంలాగ... ప్రేమకూడా "అవుట్ ఆఫ్ డేట్" ఈ రోజుల్లో.

తనలాగే ఎంతమంది యిట్లా ఈ హోటల్ గదుల్లో దొంగతనంగా... నవ్వుకున్నాడు. ప్రతిసారీ తను యిట్లా సాహసంచేస్తునే వున్నాడు. పెద్ద పోష్ హోటళ్ళు అయితే ఫరవాలేదు. పెద్దపెద్దవాళ్ళుకూడా వుంటారు కాబట్టి పోలీస్ రైడ్స్ భయంలేదు. ఏమైనా యింకనుంచీ హోటల్లో దిగకూడదు.

ఆమె లేచింది. ఒళ్ళు విరుచుకుంది. సాయంత్రం ఎంతో కష్టపడి అమర్చుకున్న జుట్టు చిక్కుపడింది. మేకప్‌లేని ముఖంలో కళ్ళక్రింద పిల్లి పాదాలు, ఒంటిమీద చీర సరిగాలేదు. అతడిని బయటికి వెళ్ళమంది, మారాంచేశాడు. బుజాలతో నెట్టి బయటకు పంపించింది. దగ్గరగా వేసివున్న తలుపుసందులోంచి చూశాడు. నలిగిపోయిన లంగా కట్టుకుంటోంది, జాకెట్టుపిన్ను పట్టటంలేదు. తానెరిగివున్న ఆ నగ్న శరీరం తలుపు సందులోంచి మరింత అందంగా కనిపించింది.

"Taxi కోసం బాయ్‌ని పిలుస్తా"నంటూ వెళ్లాడు. కారిడార్‌లో మూలగా పడుకున్న బాయ్‌ని లేపాడు. టాక్సీ పిలవమని చెప్పాడు. తిరిగివస్తూ యూపంగా మెట్లు

దిగుతున్న వ్యక్తిని చూసి మూర్ఛపోయినంతపని అయ్యింది. ఎవరా మనిషి? అమ్మ లాగావుంది. లైట్లు డిమ్‌గావున్నయ్. తను సరిగా చూశాడా! అమ్మే సందేహంలేదు. తనకి గుర్తే ఆ నడక. క్షణం కల్లోలం.

"అయితే అమ్మ రాత్రి ఈ హోటల్లో వుందా" ఆ మాటలకు ఏమిటి అర్ధమో తెలియలేదు. అవే రెండు మూడుసార్లు అనుకున్నాడు ఉపశమనంగా. ఆ విషయం అబద్ధం అన్నట్లుగా. కాని కళ్లారా చూశాడే ఎలా కాదనడం.

"ఎందుకు వుంది ఈ హోటల్లో" ఆడవాళ్ళ రాత్రిపూట ఈ గదుల్లో ఎందుకు వుంటారో తనకు తెలియదా, "అహా...ఛీ

"మరి ఎందుకున్నట్లు" తనకు నిజంగా తెలీదా...

నాన్న వరద ప్రాంతాల పర్యటనకు నిన్ననేకదా వెళ్ళింది.

అమ్మకూడా...తను చేస్తున్నపనే ఛీ,ఛీ...

తనామెకు వారసుడా...

"టాక్సీ వచ్చిందిసార్"...

అడుగులో అడుగువేసుకుంటు గదిలోకి వెళ్ళాడు.

"నువ్వు వెళ్ళిపో సరోజా" అన్నాడు.

"నీవు మరి"

"కొంచెం ఆగివస్తాను" డబ్బుతీసి యివ్వబోయాడు. వద్దన్నట్లు తలూపింది. సన్నగా నవ్వింది.

"మరల ఎప్పుడు కలవటం" అంది

మనస్సు దిగులు పడ్డది. ఉత్సాహం కలుగలేదు. ఇంకవద్దు అందామనుకున్నాడు. "నాల్గురోజులు తర్వాత" అనిమాత్రం బయటకు అనేశాడు, ఆమె వెళ్ళిపోయింది. ఒకసంబంధం చీకటితో కలసిపోయింది.

తలుపు వేశాడు నిద్రపోవాలన్న యత్నం. నిద్రరాదు. ఏదో కుమిలింపు. ఎప్పుడు నిద్రపట్టిందో తెల్లవారింది.

బాయ్‌లు హడావిడిగా కాఫీలు, ఫలహారాలు చేరవేస్తున్నారు గదుల్లోకి.

బాయ్‌నిపిల్చి కాఫీ తీసుకురమ్మని చెప్పాడు.

ఇంటికి పోబుద్ధికాలేదు. తనకి మామూలుగా అమ్మాయిల్నిచూస్తేనే ఆలోచన్లు వస్తయ్. ఇప్పుడు అమ్మను చూసినదగ్గరనుంచీకూడా ఆలోచనలు తెగటంలేదు. తను ఇన్నాళ్ళు అమ్మాయిలతో తిరిగినా ఏదో దొంగతనంగా, సరదాగావుంది. ఒక పెద్ద

అమ్మ యిప్పుడెలాగ, తాను కిందపడిపొయ్యాడు. ఒకలావాటి పోలీసువాడు లాఠీ తీసుకొని తనపై పడబోతున్నాడు. తన నెత్తిమీద లాఠీతో... అబ్బా... లారీలో ఎక్కిస్తున్నారు తనని... పోలీస్ స్టేషన్ వచ్చినట్లుంది.

గాయపడినవాళ్ళని చిరునామా రాసుకొని ఆసుపత్రికి పంపిస్తున్నారు. బాధగా వుంది. కణతలు మండుతున్నయ్.

పేరు చెప్పాడు, చిరునామాకూడా చెప్పాడు. సబ్ఇన్స్పెక్టర్ కంగారు పడిపొయ్యాడు. అతడి పై ఆఫీసరుకామాల్ను అతన్తోచెప్పాడు. ఇంటికి ఫోన్చేశారు. తనని వేరేకార్లో ఆసుపత్రికి పంపించారు స్పెషల్వార్డ్లో తను పడుకున్నాడు.

ఇంకో పది నిముషాల్లో అమ్మ వస్తుందట. అంటే యింట్లోనే వుందన్నమాట. పగలేగా వుంటుంది:

నొప్పిగావుంది. తను ఈ స్థితిలోవుంటానికి అమ్మే కారణం. జ్వరంవచ్చినట్లుగా వుంది.

దూరంగా అమ్మమాట వినిపిస్తోంది. ఆవిడముఖం ఎట్లాచూడడం.

"రాజూ ఎలావుంది."

"ఫరవాలేదన్నట్లు" తలూపేడు

ఎక్కడికి వెళ్ళావు రాత్రి నువ్వు. ఆ జనంలో యెందుకున్నావు. మన కారు తీసుకొని వెళ్ళలేకపోయావూ!

నొప్పిగా వుందన్నట్లు బాధగా మూలిగాడు. అయితే అమ్మ తమకారులోరాలేదా హోటల్కి. ఒకవేళ తనని చూసిందా హోటల్లో. నిజంగా, తనకు దెబ్బతగిలిందని బాధపడుతోందా! చెడుగా తిరిగే తల్లులకు బిడ్డలమీద ప్రేమ వుంటుందా!

"నాన్నగారికి ట్రంక్కాల్చేశాం"

"సీరియస్గా వుందని తెలియపరచవలసినవాళ్ళకి తెలియపరచాం" అన్నట్లుగా వుంది ఆగొంతు అనుకున్నాడు.

గాయం విషమించి తను చచ్చిపోడుగదా! తను చచ్చిపోతే యెవరు బాధ్యులు. ఒకళ్ళు చచ్చిపోవటానికి యింకొకళ్ళు బాధ్యులుగావుంటారా. రహస్యంగా అమ్మ సంతోషిస్తుందా? అయినా తను అనామకంగా చచ్చిపోడు. ఇందాకా జనంలోకలిస్తే యెంత బాగుంది! అంతమంది జనానికి తను నాయకుడైతే వాళ్ళకోర్కెలు తను తీర్చగలిగితే అడ్డుగావున్న వాళ్ళందరినీ ఏరేస్తాడు తాను!

అయినా ఎందుకింత కసి తనకు. అమ్మ తిరుగుబోతుఅయితే ఎందుకు తనకు కోపం. తను యెంతమంది పెళ్ళయిన ఆడవాళ్ళతో...

ఆసుపత్రి మందులవాసన తనకిష్టంలేదు. ఎప్పుడూ చావు బ్రతుకుల మధ్య సంఘర్షణ జరుగుతూవుంటుంది యిక్కడ. శరీరంతో వ్యాపారం కొంతమందిచేస్తే చావుతో వ్యాపారంచేస్తారు డాక్టర్లు. తను యింకా కొన్నాళ్ళలో ఇంజనీరు అవుతాడు. తనుకూడా వ్యాపారంచెయ్యాలికామాల్సు. ఎవరితో...

మరునాడు దినపత్రికల్లో తనపేరు పెద్ద అక్షరాల్తో ఫలానా ఉద్యమంలో... గారి కుమార్డు గాయపడినవైనం. తను గొప్పవాడైనాడా?

ఇన్నాళ్ళూ ఈ పీడితమానవులగురించి యెందుకు తను ఆలోచించలేదు. ఈవిషయాలు తనకు తెలీవుఅంటానికి వీలులేదు. ప్రజలు నరకం అనుభవిస్తున్నారు అని తెలుసుకోటానికి ఒక ప్రత్యేక ప్రయత్నం చేయనవసరంలేదు. ఈ దౌష్ట్యాన్ని ప్రతిఘటించాలి. తాను విప్లవకారుడా? తను ఏదోఒకటి చెయ్యాలి.

తను అమ్మకేగాదు. నాన్నకుగూడా వారసుడౌతాడు.

తనవాన్నేనా?

"ప్రజలు మరణించాలి"

అంత నిషాలోనూ ఎంతో కసిగా అన్నాడు రాజు.

ఎదురుగా సోఫాలో కూర్చొన్న సరోజ నిశ్శబ్దప్రార్థనలో వున్నట్లు ఏమీ మాట్లాడలేదు.

"అసలు తప్పంతా ప్రజలదే! వాళ్ళని హత్యచెయ్యాలి" చేతులు జిలజిలలాడుతున్నయ్యేమోనన్నట్లు మెటికలు విరిచాడు. "అయినా ఒకళ్ళు చంపటం ఎందుకు ప్రజలను. రోజూ చస్తునేవున్నారు. రైలు ప్రమాదాల్లోనూ, వరదల్లోనూ, పోలీసుకాల్పులలో, ఆకలితోనూ" తనలో తను గొణుక్కున్నాడు.

ఈ రాజకీయ నాయకులు, ఈ మూఢమతాచార్యులు వంచితులని, దగుల్బాజీలని ప్రజలు ఎందుకు తెలుసుకోరు. బహుశ ప్రజలుకూడా అటువంటివాళ్ళేనేమో? లేకపోతే నాయకుల సమావేశాలకూ, సభలకూ జనం తండోపతండాలుగావెళ్ళి వాళ్ళుచెప్పే బూటకాన్నంతా జీర్ణించుకున్నట్లు మాట్లాడకుండా యిళ్ళకు తిరిగివస్తారు. ఇటువంటి ప్రజలకు విప్లవాలెందుకు? అసలు ప్రజలంటే ఎవరు?

జి.వో.లు: ఎస్.ఆర్.లు గురించి గంటలతరబడి మాట్లాడుతూ అప్పుడప్పుడు బల్లలకింద చేతులుచాస్తూ ప్రతి సంవత్సరము భార్యకు కడుపుని ప్రసాదిస్తూ, పేపరు హెడ్‌లైన్సు చదివి రాజకీయాలు చర్చించే గుమస్తా యింటలెక్చువల్స్‌కూడా ప్రజలేనా? లేక.

తల్లిదండ్రులకు తెలీకుండా కాలేజీ జీతాలు బదులు ఆడబ్బుని బార్‌లోతాగుతూ, తాగినతర్వాత మెరపకాయ బజ్జీలు తింటే బాగుంటుందో లేక కోడికూర్మా బాగుంటుందో అని నిష్ఫలంగా చర్చిస్తూ, చెత్తసినిమాలుచూస్తూ అంతకన్న చెత్తగా మాట్లాడుతూ ధనాన్నీ, క్షణాల్నీకాలుస్తూ బతికే ఈ విద్యార్థియువకులా ప్రజలంటే? లేక

ఆకలిమీద, దారిద్ర్యంమీద విప్లవ గీతాలువ్రాస్తూ తాగుతూ, తూలుతూ నోటికి వచ్చిందల్లా కవిత్వమనీ, వాదిస్తూ బ్రోకర్‌తో ఫలానా కాలేజీకర్ల్ కావాలి ఈ రాత్రికి అని అఘోరించే ముందుచూపు రచయితలా ప్రజలంటే...

నిజాయితీలేని రాజకీయ నాయకులకన్నా ఊా అదృశ్య శాసనకర్తలు, గుమస్తా మేధావులు...వీళ్ళు... వీళ్ళని హత్యచెయ్యాలి.

ఎక్కడ మొదలుపెట్టాలి ఈ సర్పయాగం?

ఎర్రటి డిమ్‌లైట్లు వెలుగుతున్న 'బార్'లో కూర్చొని ఆలోచనల ప్రవాహంలో కొట్టుకుపోతున్నాడు రాజు. ఉద్రేకపడి పోతున్నాడు. ప్రజలరక్తంలాగావుంది తాను తాగే ద్రావకం.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్"అంది సరోజ.

"ఊ......"అంటూ కొంత సంబాళించుకున్నాడు.

"చూశావా ఈ న్యూస్‌పేపర్" మీ నాన్నగారు......పట్టణంలో గాంధి శత జయంత్యుత్సవాలు ప్రారంభించారట.

ఏమని మాట్లాడారో, గాంధిగారి బ్రహ్మచర్యం, హరిజనోద్ధరణా, అంతేనా"

"కరెక్టుగా ఊహించావ్"

అందులో ఊహించటానికీ ఏమీలేదు. నాయకులు ఒక్కొక్క సీజన్లో ఒక్కొక్క విషయం గురించి మాటాడుతారు. ఇప్పుడు గాంధీసీజను. ఒక్క ఇడియట్‌గురించి, పదిమంది ఇడియట్స్ మాటాడటం, చిన్నగానవ్వేదు.

హరిజననాయకులైతేనేనాన్న, పంక్తిభోజనంచేస్తాడు, అధికారంలేని హరిజనులే అంటరానివాళ్ళు. నాయకత్వం, అధికారం, డబ్బు, హోదావుంటే కులమతలు రద్దు ల్యం! ఈ హరి జనులుకూడా తెలుసుకోరు. తమ సంక్షేమానికి నాలుగుఉద్యోగాలు

యిప్పిస్తే మాట్లాడకుండా పడివుంటున్నారు తమకు పూర్తి సంక్షేమం చేకూరినట్లు. మొన్న నేకదా హరిజనబాలికల హాస్టల్లో యిద్దరాడపిల్లలకు కడుపుఅయితే నాన్న హరిజన నాయకుణ్ణి రక్షించింది.

గాంధీగారి పుణ్యమాఅని హరిజనోద్ధరణ ఒక వ్యాపారంగా మారింది.

ఎదురుగావున్న గ్లాస్‌ని పూర్తిచేశాడు.

"డ్రింక్ నీ తలకి బాగా యెక్కింది." నవ్వుతూ అంది సరోజ.

సమాధానంగా మరికొంచెం పుచ్చుకున్నాడు.

ఒక్కసారిగా లేచినుంచున్నాడు. "నేను వెళ్ళాలి. మరల రేపు కలుస్తాను." అంటూ స్ప్రింగ్ డోర్స్ తెరుచుకొని బయటకువచ్చాడు. టాక్సీకోసం రోడ్డుమీద నిలబడ్డాడు. తానెప్పుడు తల్లిని ద్వేషించాడు. తనని చిన్నతనంనుంచీ దూరంగావుంచారు. ఎవరిదగ్గరో తాను పెరిగాడు. అందుచేత నే చెడ్డఅలవాట్లన్నీ నేర్చుకున్నాడు. అడ్డమైన ఆడవాళ్ళతో తిరిగాడు. ఏమైనా యింకొకళ్ళమీద కసి తీర్చుకోవడంలో యెంత ఆనందముందని!

టాక్సీ మెల్లగా పోతోంది. టైమ్ ఎంతఅయిందో.

సినిమాహాళ్ళు, పోస్టర్లు వల్చబడ్డజనం రోడ్లమీద వెలుగునీడల్లోకి తప్పుకుంటున్నారు. లెవెల్‌క్రాసింగ్‌దగ్గర టాక్సీ ఆగింది. రైలు అతివేగంగా వెళ్ళిపోయింది. ఇంటికి చేరాడు. దర్వాన్ టాక్సీని ఆపాడు. లోపలికి తొంగిచూశాడు. గుర్తించినట్లుగా గేటు తీశాడు.

హాలులో సోఫాలోకూర్చున్నాడు. అమ్మ యింట్లోలేదు. ఎక్కడికో మహిళా సంఘ ప్రారంభోత్సవానికి వెళ్ళిందట. రాత్రి పదిగంటలయింది. ఈ మహిళాసంఘాలు ఖరీదయిన డబ్బున్న ఆడవాళ్ళు తమకాలక్షేపంకోసం యివన్నీ స్థాపించి ప్రజాసేవికలుగా చలామణీ అవుతున్నారు.

ఇన్నాళ్ళూ మంచో, చెడో మన సంస్కృతికి వారసులు ఆడవాళ్ళు, ఇప్పుడు వాళ్ళు మగవారితో పోటీపడుతున్నారు. యితరులను అనుసరించటానికే, సంఘాన్ని పీడించటానికి, ఇంక ఫరవాలేదు రెండువేల వేటకుక్కలు అంతరించటానికి ఎక్కువ రోజులు పట్టదు. విప్లవానికి నాంది యిదా?

మెల్లగ నిద్రపట్టింది.

తను కొండదిగుతున్నాడు. వెనకాలనుంచివచ్చి ఎవరో తనచేతినిపట్టుకున్నారు. తోటవేపు చీకట్లోకి తీసుకొనివెళ్ళారు. గాలికి చెట్లు కదిలినట్టు. మంచు పడుతోంది.

తన చేతిలో ఆమెచెయ్యి వణుకుతోంది. చుట్టూ నిశ్శబ్దం. ఛాతీవరకు ఎత్తయిన గడ్డిలో నడుస్తున్నారు. అమ్మో పాములు వుంటయ్యేమో? చేతులు పెనవేసుకొన్నడు. కోయిలలు కూస్తున్నయ్. ఏదో గుండె జలదరింపు. ఆమె తన కళ్ళను ముద్దుపెట్టుకుంది. ఎక్కడో దూరంగా గంటలు, నదీప్రవాహం చప్పుడు.

మెరపు మెరసింది, కళ్ళు తెరిచాడు. అమ్మవళ్లో పడుకున్నాడు తను. అమ్మ తనజుట్టులోంచి వేళ్ళు పోనిస్తోంది. గడ్డిలేదు. యూక్లిప్టస్ చెట్టుకింద వున్నారు తను. హాయిగావుంది. తనెక్కడికో పరిగెత్తుతున్నాడు. ఎవరో తరుముతున్నారు. ఆసోఫా మీద ఎవరుపడుకుంది? కదుల్తోంది. అడవినడుమ పెద్దగుట్ట పైభాగంలోనుంచున్నాడు. జలపాతం తాలూకు తుంపరలు తనపై బడుతున్నయ్ చలి. అప్పుడప్పుడు లోయలోని రైలుకూత వినిపిస్తోంది. సరోజ వెల్లకిలా పడుకుంది. అమ్మ ఏదీ? సరోజ ఎందుకుంది? ఆమె అటుచూపించింది. నీలిరంగులోయలో అమ్మవడిలో... ఎవరు? ఆమెప్రియుడా? కాదు! కాదు! అసంభవం! అరుస్తూ పరిగెత్తుతున్నాడు. సరో విరగబడి నవ్వుతోంది.

ఛీ తనతల్లి...పలుగాకి...నీచమైన అర్ధరహిత పవాంఛ తను క్షమించదు. ఎంత వంచన. అమ్మో రైలు వస్తోంది వాళ్ళదగ్గరకు వెళ్ళటం. అమ్మో తను పట్టాలమీద వున్నాడు. రైలు వేగంగా తనవైపుకు వస్తూంది. తనని చంపేస్తున్నారు. రక్షించండి రక్షించండి.

పోర్టికోలో కారు ఆగిన చప్పుడు. అమ్మ వచ్చిందా! అమ్మ గదిలోకి వెళ్లాలి! ఈ వేళప్పుడు తను అమ్మగదిలోకివెళ్తే.

"ఎమిటి రాజా"

ఎట్లాచెప్పాలో తెలియటంలేదు. ఎక్కడ ప్రారంభించాలి.

హోటల్లో చూసినదగ్గరనుండా?

"ఏమిటిరా?"

నువ్వు నాన్నకుచేసే సహాయంలాంటిదే నాకూచెయ్యాలి.

"ఏమిటిరాజూ నువ్వు మాట్లాడేది?"

"నాన్నకుచేసే సహాయంలాంటిదే నాకూచెయ్యాలి."

"సహాయం ఏమిటి"

నాన్నకు ఉపయోగపడుతున్నట్లే, నీ శరీరాన్ని అమ్మి

"నీకు మతిచెలించిందా ఏమిటి ఆ పిచ్చి వాగుడు"

ఏడుస్తూంది. తనకి జాలేసింది. ఆమెను ఓదార్చాలని అనిపిస్తూంది.

"ఏమిటి మీదిమీదికివస్తున్నావు. చంపుతావా నా కడుపునబుట్టి......"ఆమె ఏడుస్తునేవున్నది.

అవును తనని కని, పెంచింది. ఒక చిన్న కణం. తరువాత పురుగంత. ఒక ఉసిరికాయప్రమాణం, రోజురోజుకీ పెరిగి పెద్దదవుతుంది. చివరకు ఒకరోజు రక్తం మడుగులో తను కళ్ళుతెరచి వుంటాడు. నీరసంగా అమ్మ... సంతోషించి వుంటుందా... తన యవ్వనం తగ్గినందుకు శపించిందో...

నాయనమ్మ అంటుండేది తను అమ్మపోలికట. బహుశః ఆరోజునుంచే తను అమ్మని ద్వేషించడం మొదలుపెట్టివుంటాడు.

కళ్ళుతుడువబోయాడు, ఆమె విదిలించికొట్టింది.

వెల్తురులో రవ్వలగాజులు ఎర్రటి కిరణాలు చిందించినాయ్.

"అమ్మా ఎటూ నువ్వు చెడిపోయావ్. నేను చెప్పినట్లు ...ఆయనను వలలో వేసుకొని, మేము చెప్పినచోటుకు తీసుకొనిరా... మేము ఆయనను... ఆయన లేక పోతే యిక్కడ రాజకీయాలు చిందరవందరై పోతాయి. అదేమాకు కావాల్సింది. విప్లవం తీసుకురావాలి. ఈ సహాయం నువ్వు తప్పక చెయ్యాలి" ఒక్కగుక్కలో అప్పచెప్పాడు.

"నామీద పట్టించావేమిటి తాగివచ్చి, యిష్టంవచ్చినట్లు పేలుతూ...కన్నతల్లిని పట్టుకొని ఎట్లాటి మాటలంటున్నావు! రాక్షసుడా దేవుడు నిన్ను నాశనంచేస్తాడు" అంది ఎక్కిళ్ళమధ్య.

తనారాక్షసుడు? "నువ్వేరాక్షసి శూర్పనఖజాతి నీది. దేవుడు నన్ను నాశనం చేస్తాడా? దేవుడెప్పుడో చచ్చిపోయాడు. పురాణ రాముడు, లక్ష్మణుడు, కృష్ణుడు పిరికివాళ్ళు. అసలువాళ్ళందరూ బూటకం. శూర్పనఖను చంపకుండా వదిలిపెట్టారు. అందుకనే నీలాంటివాళ్ళు యింకా పుడుతున్నారు. బ్రతుకుతున్నారు. వాళ్ళకిబలంమీరే. ముందు మిమ్మల్ని చంపాలి. ఈ మారణహోమం నీతోనే మొదలు.

"కన్నతల్లిని చంపుతావా? ఇంత కిరాతుడివా! నీకు దణ్ణంపెడతాను. నీ కాళ్ళు పట్టుకుంటాను. ఆ పిస్తోలు తీసెయ్."

పాపం చావులంటే మనిషికి ఎంతభయం!

ఆమె అరుస్తూ పరిగెత్తబోయింది. బెడ్‌లైట్ క్రిందపడింది.

చీకటి, చేతులు జిలజిలపెడుతున్నాయ్. పిస్తోలు పేలింది. ఆమె అరచింది. పిస్తోలుగుండు తగిలిందా! అయ్యో చచ్చిపోయిందా? రక్తంమడుగులో పడివుందేమో. అయ్యో చీకటి. తను తప్పించుకోవాలి. తను పట్టుబడతానేమో. వాకిలిఎక్కడవుంది.

—"లీపారియా"

# ప్లస్ అండ్ మైనస్

అబద్ధంలోని మజా నిబద్ధిలో లేదు
అద్దంలో బిగించిన అందం యదార్థంకాదు
తిమిరంలోనితీపి, భ్రమకలిగించే రిమ్మ
అజ్ఞానంలోని ఆహ్లాదం, మౌఢ్యంలోని గాఢనిషా
వెలుగులో బుద్ధిలో చైతన్యంలోరాదు-
సముద్రంలో నీటిచుక్కలు ఆవిరై మేఘాలై
సాంద్రమై ఘర్షణకు వర్షమై పన్నీటిచుక్కలు ఆవిరై...
పాతంవిన్నరోజు గుండెఝల్లుమని కన్నీటిచుక్కలుఆవిరై..
వానదేవుడు సిగ్గుతో బిక్కమొహంతో సాక్షాత్కరించినరూపం
జ్ఞానదీపం వెలిగించిన చేయి అన్యాయంచేసిన అనుభూతి
కలవారికోడలు కంచికామాక్షికి కలరా తగిలి ఇలపై
పీలైన వైద్యంచేయించి, చివరికి దేవుడికి నైవేద్యంపెట్టి
ఇల్లూ ఊరు ఏకమై ఏమిటీఘోరమని తలబోస్తుంటే
'మందులేకాని ప్రాణాలుపోయలేరన్న' భయంకర సత్యం ప్రకటించిన బామ్మ-
ఆకలితో రోజూచచ్చే బికారి సొమ్మసిల్లి రోడ్డుపై మోటారు
సైకిల్‌తో బలం పోల్చుకొని గాయాలు మిగుల్చుకుని ఆస్పత్రిలో
పోయాడన్న పుకారునుండి వారంలో బయటపడి ఆకలితో రోజూ...
వాడికి భూమ్మీద నూకలున్నాయిరా బోసిగానవ్వినబామ్మ—
చంటివాడికి జలుబుచేసి ఊపిరాడక జీవన్మరణ ప్రాంగణంలో
కొట్టుమిట్టాడుతుంటే డాక్టర్ కోసం నోరుఊరుచేసుకపోరిన భార్య
వంతపాడినబామ్మ
బామ్మా భూమ్మీదనూకలేఉంటే డాక్టరెందుకని అడగాలని నోటిదాకవచ్చి
మాటరాక, కన్నీటితోకరిగి, లోనుండో అదృశ్యశక్తి కుదిపితే పరుగెత్తిస్తవైనం

1915 ఏప్రిల్ నెల చివరలో నాకొక ఆలోచన తట్టింది. మదరాసుకుపోయి ఆంధ్రపత్రిక కార్యాలయంలో పని నేర్చుకోవాలని బుద్ధి పుట్టింది. నా కోరికను నరసింహం పంతులుగారికి విన్నవించాను. వారు సంతోషించి హరి సర్వోత్తమరావు గారికి ఉత్తరంవ్రాసియిచ్చారు. మేనెల ప్రారంభంలో మదరాసుకు చేరుకున్నాను. రైలుస్టేషను నుండి తిన్నగా రావుగారి యింటికి వెళ్ళినాను. వారప్పుడు యింట్లోనే వున్నారు. ఏదో వ్రాతపనిలో నిమగ్నమై వున్నారు. నేను వారికి నమస్కారం చేశాను, కొంచెంసేపు కూర్చోమని సంజ్ఞ చేశారు. వారి పని పూర్తవుతూనే ఆప్యాయంగా నన్ను పలుకరించారు. నా కోరికను వారికి తెలిపినమీదట "నీకేమిపని చెయ్యాలనివుంది?" అని ప్రశ్నించారు. నా అభిప్రాయం తెలుసుకొన్న పిమ్మట, మదరాసులో వున్నంతవరకు తమ యింట్లోనే వుండమని చెప్పారు. భోజనానంతరంఇద్దరమూఒకరిక్షాపై ఆంధ్ర పత్రిక కార్యాలయానికి చేరుకొన్నాము. దారిలో పత్రికా కార్యాలయంలో జరిగే పనులను వివరించి, నాకోరిక యెంత వరకు నెరవేరుతుందో చెప్పలేమన్నారు. తాము చేయగలిగిన సాయం చేస్తామన్నారు. ఆంధ్ర పత్రిక కార్యాలయానికి చేరుకొన్న తర్వాత నన్ను మేడపైకి తీసుకొని వెళ్ళి, అప్పటికి నాగేశ్వరరావు పంతులు గారింకారానందున, నన్నొక తావున కూర్చుండబెట్టి, వారు వరండాలోని తమ గదిలోనికి వెళ్ళిపోయారు.

రెండు గంటలు గడిచిన తర్వాత బయటకి వచ్చి నాగేశ్వరరావు పంతులు గారితో మాట్లాడినారు. ఆ పైన పంతులుగారి మనిషి ఒకరు వచ్చి నన్ను వారివద్దకు తీసుకొనిపోయారు. వారు, నన్ను కూర్చుండమని చెప్పి, నా విషయం రావుగారు తమకు చెప్పినారని, నేను నిరభ్యంతరంగా, సెలవులలో అక్కడ పని నేర్చుకోవచ్చునని చెప్పి, ఆఫీసుగదిలో నున్న మేనేజరును పిలిచి నన్ను ఫలానావారి కప్పగించమని ఆజ్ఞాపించారు. నన్నాయన, కార్యాలయం దిగువ భాగంలోనున్న ఒక తావుకు తీసుకొనిపోయారు. అక్కడ ఇద్దరు వ్యక్తులున్నారు. ఒక వృద్ధుడు, ఒక యువకుడు; మేనేజరు నన్ను వారి కప్పగించాడు. వారిరువురు ముద్రాక్షర శాలనుండి వచ్చిన పొడుగుపాటి కాగితపు బొత్తులను పరిశీలిస్తున్నారు. ప్రక్కన లావుపాటి పెద్ద పుస్తకాలున్నవి. ఆ ముసలాయన నన్ను ప్రక్కన కూర్చుండబెట్టుకొని అక్కడనున్న కాగితాల బొత్తిలో ఒక కాగితాన్ని నాకిచ్చి, దానిని పరిశీలించటానికి అవసరమైన గుర్తులను తాము నేర్పుతామని చెప్పారు. ఆ ప్రకారంగా వారు నాకు కొంత పని పురమాయించారు.

సాయంత్రం నేను రావుగారితో పాటు రిక్షాలో వారి యింటికి వెళ్లాను. నా పని ఎలాగున్నదని వారడిగారు. పత్రికా రచన నేర్చుకొనడానికి వచ్చిన నాకు, ప్రూఫ్ రీడింగు పని అప్పగించి

# కష్టజీవి ప్రశ్నలు

[ఇది. సుప్రసిద్ధ జర్మన్ నాటకకర్త, కవి. సాహితీవేత్తఅయిన బెర్టోల్ట్ బ్రెక్ట్ రాసిన కవిత. ఇది. మన మహాకవి శ్రీ శ్రీ రాసిన "దేశచరిత్రలు" కవితలో కొన్ని భాగాల్ని పోలివుంది. సాహిత్య చరిత్రలో ఇలాటి విశేషమైన సామ్యాలు లేకపోలేదు. బ్రెక్ట్ రాసింది సుమారు 1930 ప్రాంతాల్లో, శ్రీ శ్రీ రచన 1938 లో.—అను॥]

తేబిస్ నగర సప్త ద్వారాలు
నిర్మించిన వారలెవరు ?
రాజు లేనని చెపుతాయి గ్రంథాలు !
ఓహో ! కొండలు తొలిచి
బండలు చేర్చింది రాజులా ?!

పలుమారులు రూపు మాసిన బాబిలన్‌కు
పదే పదే రూప మిచ్చిన శిల్పులెవరు ?

సుందరతమ స్వర్ణ ఖచిత 'లేమా'
లో వాసించిన వారలెవరు చెప్మా ?!

కట్టడాలు పూర్తయిన 'చైనాగోడ' పై
సాంధ్యరాగం అలుముకొన్నప్పుడు
కట్టకడపట కూలీలు తలదాచుకుందెక్కడ?

విజయ సంకేతాల తోరణాలతో
నిండిన రోము నగరపు నేతలెవరు ?
విజేతలైన సీజర్లా
'పాపర'యిన సామాన్యులా ?

హెచ్. వి. కృష్ణా కంపెనీ కార్యక్రమంలో నిమగ్నమయ్యేవారు. ఒంగోలుకు వచ్చిన కృష్ణయ్యగారిక్కడ ప్రత్యక్షమయ్యారు. నాకు ఆంధ్రపత్రిక కార్యాలయంలో ప్రూఫ్‌రీడింగ్ నేర్పిన శ్రీ రాఘవయ్యగారు వీరి జనకులు. పైకంపెనీలో భాగస్వాములు ముగ్గురు. ఒకరు హరిసర్వోత్తమరావుగారు, రెండవ వారు చిలుకూరి వీరభద్రరావు గారు, మూడవవారు కృష్ణయ్యగారు. ఈ కంపెనీ విజ్ఞాన చంద్రిక ప్రచురణల అచ్చుపని బాధ్యత, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము ప్రచురణ బాధ్యత, తెలుగు దేశంలోని రచయితల రచనలను వెలుగులోనికి తీసుకొని వచ్చుటకు సాయపడుట వంటి బృహత్తరమైన బాధ్యతలను యీ త్రిమూర్తులు స్థాపించిన కంపెనీ చేపట్టినది. వ్రాతప్రతుల పరిశీలన, సవరణ బాధ్యతలను శ్రీ రాఘవయ్యగారు నిర్వహించేవారు.

తాత ముత్తాతల నాటినుండి శ్రీహరి సర్వోత్తమరావుగారి కుటుంబ సభ్యులు లక్ష్మీదేవి అనుగ్రహానికి నోచుకున్న వారు కాదు. వీరభద్రరావుగారు ఆంధ్రుల చరిత్రను ప్రప్రథమంగా వ్రాసిన సుప్రసిద్ధ చరిత్రకారులు. వీరు కూడ పేదరికంలో మన్నవారే. రాజమహేంద్రవంలో వుంటూ అక్కడనుండి యీ కంపెనీ కార్యకలాపాలకు సహాయపడుతూవుండేవారు. శ్రీ చతుర్వేదుల కృష్ణయగారు సేవాప్రియులు, ఉత్సాహవంతులు, స్నేహశీలి. లక్ష్మణరావు గారి కలలను కార్యరూపానికి తెచ్చిన కర్మయోగి, నిరంతర శ్రమజీవులు, పితృభక్తి పరాయణులు. వీరు తండ్రి గారి సహాయంతో తర్వాత కొంతకాలానికి నెల్లూరు సమీపంలోని పల్లెపాడులో సత్యాగ్రహాశ్రమాన్ని స్థాపించి దానిని సమర్థవంతంగా నిర్వహించిన కార్యదక్షులు. దీనికి పిమ్మట శ్రీ కృష్ణయ్యగారు అరవిందుల అంతే వాసియైనారు. ఆ మహాయోగి రచనలను ఓం ప్రథమంగా తెలుగులోనికి తీసికొని వచ్చిన మహాభాగ్యం వీరికి దక్కింది.

రావుగారు ఉదయం 8 గంటలకే కాగితాల కట్టలు ముందుంచుకొని ఏమేమో వ్రాస్తూ వుండడం, నేను మదరాసుకు వెళ్లిన మొదటిరోజే గమనించాను. ఆంధ్ర పత్రిక కార్యాలయంలో దాదాపు 8 గంటలు పనిచేసేవారు. అది బండచాకిరి. ఆనాటి పరిస్థితులను పట్టి పాఠకులకు ఏ విషయం ఆకర్షణీయంగా వుంటుందో ఆలోచించుకొని 2 కాలములు ప్రతిరోజూ సంపాదకీయం వ్రాయాలి. నిత్యమూ పత్రిక కార్యాలయానికిచేరే ఉత్తరాల కట్టల సంగతి చెప్పవలసిన పనిలేదు. వీటన్నిటినీ స్వయంగా చదివి అవసరమైన వాటికి జవాబు లివ్వాలి. ఈ పనిని యితరులకు పురమాయించకుండాతామే నిర్వహించడం, మధ్య మధ్య శ్రీ నాగేశ్వరరావు పంతులుగారిని కలుసుకొని సంప్రదించడం, ఆనాడు పత్రిక కార్యాలయానికి చేరిన తెలుగు, ఇంగ్లీషు, కన్నడ, తమిళ, మరాఠీ వగైరా భాషల లోని పత్రికలను తిరుగవేయటం వీటన్నిటినుండి యెన్నిక చేసిన వార్తలు వగైరాలననువదించటం – ఈ పను

# జైళ్ళు నోళ్ళు తెరుచుకున్న నాడు

మాస్కో మౌసోలియంలో
గాఢ సుషుప్తిలో మునిగివున్న వ్లాడిమిర్ లెనిన్
నిద్రా భంగం కలగజేస్తోన్నందుకు క్షమించు
నా యీ లేఖ నొక్కసారి తిలకించు.

అన్ని దేశాల్లో వలె మా ఇండియాలో కూడా
నీ శత జయంతి ఉత్సవాలు జేశాం
ఇన్నేళ్ళుగా నే కన్నవీ విన్నవీ నీకు
విన్న విద్దామని ఈ సందర్భంలో నేనిది రాస్తోన్నా.

మాపటి చీకటి పోగొట్టి రేపటి వేకువ చూపెట్టి
మరో ప్రపంచ సృష్టికి బాటలు వేసిన
మానవ విముక్తి దాతా పీడిత జాతుల నేతా
నా జాతి జనుల కడగళ్ళను గూర్చి కొంచెం విను.

శ్రామికవర్గ అంతర్జాతీయతకి సలాం గొట్టినా
చీకూ చింతాలేని జీవితాల్ని
సోవియట్ ప్రజలు గడుపుతోన్నారని భావిస్తాను
మా దేశంలో మేమూ ఔమమూ క్షేమంగానే వున్నాం:

ప్రాతఃకాలానే లేసి తలారా స్నానం జేసి
మడిగట్టుకొని వెంకన్నకి దీపారాధన జేసి
కాళ్ళకి పసుపూ గొంతుకి గంధమూ పూసి
కోరికల గుర్రాలపై నిరంతరం స్వారీజేస్తొన్న నారీమణులు.

క్రికెట్ మ్యాచి కామెంటరీలూ జేమ్స్‌బాండ్ పిక్చర్లూ
కాబోయే పెళ్ళికి రాబోయే కట్నాలూ
కాలహరణం కోసం చతుర్ముఖ పారాయణాలూ
మరో ప్రపంచం యెరగని భావి భారత వీరులు!

గాజు కిటికీల గుండా గంజిలేనాళ్ళ బతుకుల్ని చూస్తో
రాజుకొంటోన్న నిప్పుకి నిరర్థక వ్యాఖ్యానాలు జేస్తో
సర్వేజనా సుఖినోభవంతంటూ తేపుతూ
మేతావులే ఎంతో మేలనిపించే మేధావులు!

నంగిపూజకీ దొంగభక్తికీ వొంగొంగి సలాములుజేసే గులాములు
పైసా తప్ప మరోధ్యాసలేని కాసు చేతులోని దాసులు
గుండు గొరుగొడు దేవుళ్ళ పూజార్లు — స్వాములవార్లు
యజ్ఞవాటికలో మొగాళ్ళని ముద్దెట్టుకొనే అనంతభగవాన్లు

నలభై వేల తులాల వెండితో
గోవింద రాజ స్వామికి రజిత రథం
గుండు గొరుగుడు దేవుడి గర్భగుడి
రెండవ ద్వారానికి బంగారు పూత.

కొండమీదవున్న నాంచారి మొగుడికి
వజ్రవైఢూర్య గోమేధిక పుష్పరాగ
మరకత మాణిక్యాదులు పొదిగిన
కర్ణకుండలాలూ హస్తభూషణాలూ.

ఏడాదికి అయిదుకోట్ల ఆదాయం గడిస్తో
కోటి రూపాయల ఆభరణాల్తో భోగం ముస్తాబయ్యే
మా వెంకటేశ్వరుడికంటె కోటీశ్వరుడైన దేవుడు
ఈ భూమండలంలో మరోడు లేడు.

దోపిడీ పాలకవర్గాలు పేదాళ్ళ దృష్టిని
భీకర దారిద్ర్యం నించి మళ్ళించేందుకి
దేవుళ్ళ పేరిట దిష్టిబొమ్మల్ని సృష్టించి
నిస్సిగ్గుగా వాటికి శవాలంకరణ జేస్తారని
మార్క్సింగోర్కీ చెప్పిన మాటలు
నేటికీ మేం మరిచిపోలేములే.

దేశవాళీ జార్లనీ చోర్లనీ పుకార్లనీ
జనరంజకంగా ప్రచారం జేస్తో

జైళ్ళ నోళ్ళు తెరుచుకున్న నాడు

ఘన స్తన జఘన జవ్వనుల ముఖచిత్రాల్తో
మేకప్ జేసుకొంటోన్న నేటి శతాధిక వారపత్రికలు.

సామాన్యుల మెదళ్ళ చుట్టూ ముళ్ళకంపలేస్తోన్న
గుత్తాధి పతుల గొలుసు దిన పత్రికలు
పురోహిత ధనస్వామ్య దోపిడీ వర్గాలు
సామూహికంగా వుంచుకొన్న జాతీయ వారపత్రికలు.

పీనుగలమీద కప్పే సైనుగుడ్డలు సైతం గతిలేని
కోటానుకోట్ల మా హరిజన సోదరుల
లోక భీకర నరక యాతనల్ని
శోక భీకర జీవితాల్లోని కాటిక చీకట్లని

గోనె పట్టాల్ని దుప్పట్లుగా కప్పుకొంటోన్నవారి దారిద్ర్యాన్ని
కుసుమ కోమల సదృశమైన వారి పసికందుల ఆర్తనాదాల్ని
సాహిత్యంలో చిత్రించేందుకి మా కథకులకీ కవులకి
నవరా రచయిత్రులకీ వీసమంత తీరికసైతం లేదు.

మధ్యతరగతి అల్పిష్టి రాగద్వేషాలకి ప్రతిబింబమై
జాతి జీవితానికి పూరాగా దూరమైన నేటి రచయితలు
ఇంట్లో కుండలు డింకీలు గొడుతోన్నా మేడల్నే చిత్రిస్తారు
కుక్కిమంచంలో నల్లులు కుడుతున్నా
డన్‌లప్ పరుపులపైనే నాయికా నాయకుల్ని పండబెడ్తారు:

చావలేక బతకలేక చాలీచాలని జీతాల్తో సతమతమయ్యే
లక్షలాది ఉద్యోగులు సమ్మెచేసి జీతాలురాక సస్తోంటే
ఉగాది పచ్చడి గురించి ఊకదంపుడు వ్యాసాలూ
అభ్యంగన స్నానం గురించి పోసుకోలు గ్యాసులూ
శుక పిక కుహూ కుహూ రవాలూ పాలు పంచదార కోవాలూ
వికసిత కుసుమాల శీతల దనాలూ నవవసంత శోభలూ
చైత్రరథ పథాలూ గోచార ఫలితాలూ
పంచాంగ శ్రవణాలూ మంత్రుల ప్రయాణాలూ గూర్చి
పేజీలకి పేజీల్ని ప్రచురించే మా పత్రికా సంపాదకులు
ప్రొప్రయిటర్ల కనుసన్నల్లో మెలిగే ఎడిటర్లనీ

దోపిడీ దార్లుంచుకున్న నట విట గాయక గణికలనీ
పరాన్నభుక్కులకి లాభాలార్జించిపెట్టే బంగారు కణికలనీ
అంతర్ముఖుడవై ఆలోచించుకొంటున్నావా మహనీయా?

శ్రామికవర్గ మానవతావాద సాహిత్యం
వెస్టెడ్ ఇంటరెస్టు గుడ్డి గుర్రాల పళ్లు తోమరాదనీ
ప్రొలిటేరియన్ హ్యూమనిజాని కర్థం
పడకటింటి ముచ్చట్ల కవిత్వం కాదంటూ
మాక్సిం గోర్కీ వక్కాణించిన నిత్య సత్యం
మననం జేసుకొంటామని మేం
నీ శత జయంతినాడు శపథం జేస్తొన్నాం.

కామధేనువుల్లాంటి మంత్రిపదవులూడిపోతే
ఊడగొట్టిన మంచంకోళ్ళమై పోతామనే దుగ్ధతో
నీతి నిజాయితీల్ని కబేళాలకి వొదిలేసి
రాజకీయ వ్యభిచారం జేస్తోన్న మంత్రి వర్యులు.

పచ్చి గుడిసేట్లుగా మారిన నేటి బూర్జువా పాలిటిక్స్‌లో
యం. యల్. ఎ. లు కొనుగోలు వస్తువులు
గ్రామ పంచాయతీలు గుడ్డ వల్లేరు గొడ్ల సంతలు
సమితుల ఎన్నికల్లో వేలంపాటలు – బానిసల శిబిరాలు

పొద్దునొ హాటజెప్పి రాత్రికి యింకోటి జేసే ఊసరవెల్లులు
నేడు మా దేశానికి నాయకమ్మన్యులు
పంచాయతీల స్థాయికి దిగజారిన పార్లమెంట్ ఎసెంబ్లీల్లో
ప్రతి నిత్యమూ కొట్లాటలూ తిట్లూ వాకౌట్లూ!

గుంటనక్కలకీ పందికొక్కులకీ
ఎర్ర నల్లులకీ గండు పిల్లులకీ
మాదేశంలో వున్నంత గౌరవాదరణలు
ఈ భూప్రపంచంలో మరెక్కడా లేవు.

ధర్మా ధర్మాలకి నిఘంటువుల్లోని అర్థాలే మారాయి
బుద్ధీ శుద్ధీ మనుషుల హృదయాలనించి జారాయి

# ముఖ చిత్రం



The woods are lovely, dark and dee
But I have promises to keep
And miles to go before I sleep.
And miles to go before I sleep.
— Robert Frost

(నెహ్రూ స్వదస్తూరితో వ్రాసి పెట్టుకున్న పలుకులు)

చరిత్ర పుటలలో సువర్ణదీప్తులు వెదజల్లి తమ పుణ్యజీవితం సమస్త మానవాళికి ఆశాదీపం కాగల జవహర్ లాల్ నెహ్రూ వంటి మహనీయులు చాలా అరుదుగా జన్మిస్తూంటారు. ఆనాటి బుద్ధుని వెనుక జన్మించిన అశోకుని వలె, ఈనాడు గాంధీ వారుసునిగా, బాపూజీ కలలుగన్న శాంతి, అహింస లను క్రియారూపాన రాజనీతిలో, పరిపాలనాదక్షతలో, ప్రపంచ వ్యవహారాలలో కనబరచి, సభ్య మానవాళిలో మహానాయకునిగా ప్రజాహృదయాధిపతిగా భాసిల్లాడు నెహ్రూ. ఎంతటి నైరాశ్యతలోను జీవస్పందనగా ఎంచిన సిద్ధాంతాలను విడనాడకుండా, చిరునవ్వుని చెదరనీయకుండా వచోధారల ద్వారా హృదయ కుసుమ పరిమళం వెదజల్లుతూ, అల్పత్వంలోను అజ్ఞానంలోను క్రుంగుతున్న ఈ భారతజాతిని, సువిశాల భారతదేశాన్ని స్వహస్తాలతో లేవనెత్తి నాగరిక ప్రపంచములో మన ఆత్మ గౌరవాన్ని నిలబెట్టిన మేరునగ ధీరుడు నెహ్రూజీ. ఏభై సంవత్సరాల పాటు భారతీయుల భవిష్యత్తుని తన భుజస్కంధాలపై మోసి, మనసూ మెదడూ ఉత్సాహంతో ముందుకు వురుకులెత్తుతున్నా ఈ పాంచభౌతిక కాయం అలసిపోవటంవల్ల పుణ్యభూములకు మళ్ళి పోయాడు ఈ పూర్ణజీవి.

*　　*　　*

కాశ్మీరులో జన్మించిన నెహ్రూ పూర్వీకులు 1716లో ఢిల్లీ నగరానికి వలస వచ్చారు. సంస్కృత పర్షియన్ భాషలలో పండితుడైన రాజ్‌కౌల్ మొగలాయి సమ్రాట్ వద్ద రాజోద్యోగం చేస్తూండేవాడు. వీరిజాగీరు ఒక కాలువ పక్కగా వుండటంచేత, కౌల్ కుటుంబ నామధేయం హిందూస్థానీలో 'నహర్' గా, ఆపైన నెహ్రూగా మారింది. మోతీలాల్ నెహ్రూ తాతగారు ఈస్ట్ ఇండియా కంపెనీ (సర్కారి కంపెనీ) లోవకీలుగా వుంటూ వుండేవాడు. 1857 ప్రథమ భారతవిప్లవంనాటికి, మోతీలాల్ నెహ్రూ తండ్రి, అనగా జవహర్‌లాల్ తాతగారు, ఢిల్లీ పట్నానికి కొత్వాల్‌గా వుండేవారు. అప్పట్లో వీరి కుటుంబము ఆగ్రాకు మారారు.

ఆగ్రాలో 1861 మే 6 తేదీన మోతీలాల్ జన్మించారు. సరిగా అదే రోజున భారతమాత మరొక రత్నాన్ని కన్నది– రవీంద్రనాథ్ టాగూర్.

సారస్వత రంగంలో రవీంద్రులు, రాజకీయ రంగంలో మోతీలాల్ నిరుపమకృషి జరిపి, ఈ నిద్రాణ జాతిని తట్టిలేపుతూ, మానవులందరు

దోపిడీ వర్గాల కాపలా కుక్కలాంటి
ఈ బూర్జువా రాజ్యాంగ చట్ట పరిధిలో
తలనించి వేలుదాకా అవినీతి కుష్టుతో కుళ్ళిపోయిన
నిరంకుశోద్యోగ వర్గ పర్యవేక్షణలో
కూడూ గుడ్డల కోసం కలగనడం
ఆత్మవంచనతప్ప మరోటికాదు
నివురు గప్పిన నిప్పులా వుంది నేటి దేశం
సాగర మథనంలా వుంది సామాన్యుని హృదయం
కళపెళ కాగుతోన్న బాయిలర్‌లా వుంది నేటిసంఘం.

రక్తంం మడుగులపై వర్ధిల్లుతోన్న
ఈ దోపిడీ వ్యవస్థని బాగుచేయడానికి
ఏమాత్రం పనికిరాదు సంక్షేమ పెన్సిలిన్ ఇంజెక్షన్
సోషలిస్టు పొలికేకల సిద్ధమకరధ్వజం
ఈ కుష్టు రోగిష్టి పాలకవర్గాన్ని రక్షించలేదు
దుష్టాంగాన్ని ఖండించి శేషాంగాన్ని రక్షించేందుకి
జరిగితీరాలి— రెవల్యూషనరీ ఆపరేషన్.

ఈ దేశం దరిద్రుల పాలిట బ్రహ్మాండమైన ఆరుబయలు జైలు
ఈ పాలకవర్గం మాబొచ్చెల్లో విసుర్తోంది ప్రతినిత్యం బండరాళ్ళు
కులాలు మతాలు విధిరాతలు మా పాలిట బ్రహ్మజెముడు ముళ్ళు
కడుపునిండిన వేదాంతుల నీతులు మా పాలిట శ్మశానం గోతులు.

నడి మధ్యన సిరి నరాలమీద పుండుతో బాధపడుతో
అర్ధరాత్రి వెన్నెట్లో గొడుగులు పట్టించుకొంటో
బార్లూ బీర్లూ కార్లూ షికార్లతో గోళ్ళు గిల్లుకొంటో
ఇరవైయేళ్ళ నించీ దేశాన్ని దోచుక తింటోన్న
ఈ దోపిడీగాళ్ళ కాళ్ళకింద చింతనిప్పులు పోసిననాడు
వీళ్ళ కాళ్ళకింద నేల తొలుచుక పోతున్న నాడు
జాతి జీవితంతో చీట్ల పేకాటాడే
ఈ చట్టా వ్యాపార్ల భరతం బట్టిన నాడు
ఈ రాంఢోళ్ళ పొట్టలు ఉసుళ్ళపుటల్లా బద్దలైన నాడు
అరవై కోట్ల నిష్టదరిద్రుల కంఠాల్లో

ఆకాశం భూమీ దద్దరిల్లిన నాడు
తేరతిండి తినడాన్ని ధర్మబద్ధం జేసిన
ఈ చట్టాల్ని ముక్కముక్కలకింప చించేసిన నాడు
నూట యిరవై కోట్ల పీడిత జనతా హస్తాలు
వీళ్ళ చట్టాల్నీ ఇనస్పెక్టర్ల్నీ ప్రాస్టిట్యూట్లనీ
కాబూలీవాలా పెర్సెంట్ ఇంటరెస్టుల్నీ
భస్మీపటలం గావించిన నాడు
పోరాటాల భూకంపాల్లో
యావద్భారతమూ ఊగిపోయిన నాడు
జాతి విముక్తికోసం బందీచేయబడ్డ
ఖైదీల జైళ్ళ నోళ్ళు తెరుచుకున్న నాడు
ఆనాడు మా జాతికి మహోదయం
ఆనాడు మా జాతికి అరుణోదయం
ఆనాడు మా దేశానికి సామ్యవాద భానోదయం
అంతదాకా మాకు భుక్తి లేదు రక్తి లేదు విముక్తి లేదు

అంతదాకా మా జాతి అకలిగొన్న సింహంలా
ఈ దేశం అడవిలో గర్జిస్తూనే వుంటుంది.

— సి. వి.

'ప్రజను సాయుధం చేస్తున్న
రివల్యూషనరీ నేడు కవి'

విప్లవ మార్గంలో ఉన్న సమాజంలో కవికి వినూత్నమయిన నిర్వచనమూ,
విప్లవ బాధ్యతాయిస్తున్న విప్లవ కవుల పిలుపు

★ మార్చ్ ★

వెలువడింది ! 80 పేజీలు, వెల : ఒకరూపాయి.

ప్రతులకు : కిషన్‌రావు, పోస్టు : చెన్నూరు, వయా : కొడకండ్ల
జనగామ తాలూకా, వరంగల్ జిల్లా.

# నగరమే పులి అయినప్పుడు . .

అడవిలో
ప్రతిచెట్టూ రహస్యాన్ని దాస్తుంది
విప్లవాన్ని పూస్తుంది.

కొండలమీంచి వీచే గాలులు తెచ్చే
ఆ పరిమళాలకు హృదయం పులకించి
ఆ పువ్వుల్ని చూడాలనిపిస్తుంది.

పొదల్లో అవి ఎక్కడ దాక్కుంటాయో
ఎక్కడ రాలుతాయో
ఏ జంతువు కాళ్ళకింద నలిగిపోతాయో
మనకు పరిమళాల వార్తల్ని పంపి
ఏ చీకట్లో మౌనంగా వాడిపోతాయో
అమాయకపు అడవిజాతి పిట్టల నోట్లోకి
ఆత్మీయమయిన తేనెల్ని అందిచేప్పుడు
ఏదుర్మార్గుని తుపాకిదెబ్బకు కూలిపోతాయో
కొండవాలుల వెంబడి
ఎండదెబ్బలకు కాలిపోతాయో...

చెట్లు అజ్ఞాత వీర ప్రసవాలు
ప్రతి చెట్టు హృదయంలో అగ్ని
ప్రతి కొండశిఖరమూ చెకుముకి
ఆకులు నిస్తంత్రీ సంకేతం
పక్షులు సహస్రాక్షులు.

* * *

బతుకులు కొరడాలకింద వీపులై
భావాల కాలువలు నిలువ నీళ్లై

దిసమొల పాదాలను దేవిడీలు
దిన సమస్యల మంటల్లోకి ఉరికించినపుడు
తోలు ఊపిరి తిత్తులకు కావలసిన
ఔన్సు ఆక్సిజన్‌కూడ
ఫ్యాక్టరీ గొట్టాలు మింగేసి
వాతావరణంలో బొగ్గుపులుసుగాలి మాత్రమే
మిగిల్చినపుడు
అడవి చేతుల్లో సూర్యుడు
శూలాలవలె ఆడి
అడవి నడుముకు నది కత్తివలె వేళ్లాడి
అడవి యోధునివలె
ఆరోగ్యకరమయిన గాలులకు
ఆచరణ ద్వారాలు తెరుస్తుంది
ఆలోచనా పవనాలు మోస్తుంది.

నగరమే పులి అయినప్పుడు
ప్రజలు అడవుల్లో తలదాచుకోక తప్పదు
మాటుకాచి పులిని
కూల్చేయటమూ తప్పదు.

* * *

పువ్వులు మన్మధుని బాణాలనికదాఅంటారు-
అడవిలోని పువ్వులు బాణాలు
ఎవ్వరివోకాని బాణాలు నిజం
ప్రాణాలు.
రేపు దేశమంతా తావులు వెదజల్లాలని
ఇవ్వాళ మేలుకొన్నవి
రేపటి కొత్తసృష్టికోసం
ఇవ్వాళ రాలుతున్నవి.

# ఉద్యోగ పర్వం

భారత నిరుద్యోగ పర్వంలో
బతుకుతున్న మనిషిని
కాలం ప్రయోగశాలలోని
మూసలో మరుగుతున్న ద్రవాన్ని

ఉద్యోగంకోసం తిరిగి తిరిగీ
నా హృదయం చెప్పు అరిగిపోయింది.
నేను కాలుమోపినచోట రక్తంపడి
భూమి ఎర్రబడి ఏడ్చింది
నా మనసు పిన్నువిరిగిపోయి
బాధతో మూల్గింది.
కడుపు నింపుకొనేందుకు
కాకాహోటల్లో తిండికి పావలాలేక
నల్లా నీళ్ళతో కడుపు నింపితే
ఆ నీళ్ళు సరఫరాచేసిన అధైర్యం
కడుపులోని ఆకలిస్థలాన్నాక్రమించింది.
నా కండ్లలో రాజుకున్న కోపమేనేమో
సూర్య గోళానికి అంత ఎరుపుదనమిచ్చింది

ఉద్యోగం సంపాదించడానికి
నేను వినాయకుడి పూజ చేయలేదు
సంభావనా లేదు
ఆఫీసరు టేబిల్‌మీది పేపర్ వెయిట్
ఫ్లవర్‌వేజ్‌లోని కాగితంపూలకన్న
విలువైనా నాకీ సంఘంలో లేదు.
కనీసం వాడి పెళ్లాం పెదవులపై

ఉద్యోగపర్వం

విరిసిన చిరునవ్వుకున్నంత
గౌరవమైనా నామీద ఎవరికీ లేదు.

వర్తమానం స్క్రీన్ మీద
భూతకాలపు జీవితపు ఫ్లాష్‌బ్యాక్ చూస్తూ
భవిష్యత్తు అడవిలో
గర్జించబోతూన్న సింహాన్ని.

— యాదగిరి.

# విప్లవ శాసనాలు

శాంతీ అహింసా
ప్రజల
కాళ్ళూ చేతులూ కట్టేసిన
తాళ్ళయినప్పుడు
పార్లమెంట్ జైల్లో
చిత్రహింసకి
స్వాతంత్ర్యం పెడబొబ్బలు పెడుతున్నప్పుడు
ప్రజల కన్నీళ్ళు ఆజ్ఞలు జారీచేస్తున్నాయి
ప్రజల సాహసాలు ఆయుధాలవుతున్నాయి

ఉమ్మడి శక్తుల భిక్ష
సంపదని
శత్రువు బలాత్కరించి చెరచి
చరిత్ర కన్నతల్లి కళ్ళను పొడుస్తున్నప్పుడు
సంపన్నుల రూపాయినోట్ల తొత్తు అధికారం
కౌగిటపాలి చుట్టూ
ప్రజాచైతన్యం మంటల్లేస్తున్నాయి.

వీరుల రక్తపు చినుకులు
త్యాగాల అమరత్వాన్ని నాటుతున్నాయి
ప్రజలకు కోటగా ఆయుధాలు మొలుస్తున్నాయి
చరిత్ర ఆకలికి ఓర్చుకోలేక
ఆయుధాలు
అధికారం గుడ్డికళ్ళమీదికి
తిరగబడుతున్నాయి
అనుభవాల అయికమత్యాన్ని
కూడదీసుకుని
అధికారం తలల్ని చూరుకు వేలాడేస్తున్నాయి

దిక్కులేనివాళ్ళ హక్కుల్ని
సాధించటానికి
ఆయుధాలు
నెత్తురు విప్లవ శాసనాలు రాస్తున్నాయి
సముద్రాలని తోడు తీసుకుని
ముందుకు సాగుతున్నాయి.

—ఎక్స్-రే.

## శాంతి ?

ఈ శాంతి
ఈ బూటక ప్రశాంతి,
నోట కు సీళ్లువేసి
కూతరాకుండా గొంతుకోసే ఈ సౌండ్‌ప్రూఫ్
విజ్ఞాన శాంతి,

చిచ్చుపెట్టిన కడుపుల్లో ఆ కళ్ళ కాలి

అరుపులూ చచ్చి
శవాల్లా పడి వుంటే
చిరునవ్వుతో పావురాలెగరేసే చిప్పమొహంశాంతి
నొప్పిలేకుండా, తెలియకుండా—నెత్తుర్లుతాగే
జలగ శాంతి,
ఒప్పనిదాని గొంతుపిసికి రమిస్తుంటే
జండాలు రెపరెపలాడిస్తూ
"ఊంఛారహే"లు పాడే
నీచ శాంతి
దొంగ శాంతి
శాంతిశ్శాంతిశ్శాంతి హీనాం హిహిహిహీ
వికటాకటకట ఫటేల్మన్న కోరల్తో
కసుక్కున గొంతుకొరికి
మళ్ళీ కోరలకు పూసుకునే
'శాంతి' మార్కు తెల్ల పెయింటు
ఒక్క దెబ్బకు
ఒక్క గుద్దుకు
ఒక్క పోటుకు
ఒక్క తుపాకీ గుండు దెబ్బకు
నాశనమైపోవాలి.

—అశోక్.

# రైట్ టు ఓట్ కాదు-

కోట్ల అస్థిపంజరాజలమీద మస్తీగా కొందరు
రక్తపు గిలాస లెగరేస్తూ
ఆకలి సముద్రంలో మమ్మల్ని తన్నేస్తూ—
ఆకాశానికెత్తిన పెట్టుబడి—వేయిపడగలు
మా బ్రతుకుల్లో విషం కక్కుతూంటే

మూడు కోతులూ బోడినవ్వులూ జాతిని నిర్వీర్యంచేసేస్తే
ఇంకా వ్యక్తి స్వేచ్ఛ అనే వెర్రిభ్రమలో
వర్గసామరస్యం పన్నిన వలలో
గిలగిలా తన్నుకోలేను

భాక్రానంగల్లూ నాగార్జునసాగర్లూ
'గాషోష్ళ' షవర్ బాత్‌రూముల్లో ఊడిగాలు చేస్తోంటే
ఈ జాతీయ వంచకుల బద్మాష్ డ్రామాలో
ఫూల్‌గా నటించలేను
ఈ కొండమంగలి వెధవల చేతుల్లో నిస్సహాయంగా తల ఉంచలేను

ఇరవై మూడేళ్ళ భయానక చరిత్ర రాష్ట్రైవింగ్‌లో జాతి మెదడుకి
ఎన్నెన్ని లోతైన సెప్టిక్ గాయాలు
దారిపొడుగునా ఎన్నెన్ని దారుణ దృశ్యాలు

నా చెల్లెళ్ళ దేహాలనిండా పిచ్చికుక్కల కాట్లు
నా పిల్లల అమాయకపు చూపుల్లో కత్తిపోట్లు

ఉఫ్ ! భరించలేను
గుండెలో మంట
నరాల తెగింపు

ఇవాళ నాకసి వెలిగించిన నెత్తురుమంటల్లో నిలబడి చెపుతున్నా
మెలితిరిగే కడుపులో ఆకలిమాట అంటున్నా
రైట్ టు ఓట్ కాదు
ఈ దోపిడీ రేచుకుక్కల్ని తరిమి తరిమి
ఫైట్ టు ది లాస్టు.

లోచన్.

# ఆయుధాగారం

## అనుక్రమణిక

విగత సిద్ధాంతాల మాయాపాచికలతో
జూదమాడి వోడి ఎన్నికల అడవుల్లో
సుదీర్ఘ వనవాసంచేసి
వక్రవాదపు విరాటుడి కొలువులో
దివాన్గిరి ఊడిగం చేస్తున్నవారు
మురుసుకొంటూ ఉండగా
భ్రమల వృక్షంపై ఆత్మవంచనా కళేబరంలో
దాచిన ఆయుధాలు
జ్ఞప్తికి తెచ్చుకొన్న నవనరునికి
బృహన్నలత్వం తొలగి
బీభత్సుడై రణశంఖం పూరించగా
ముహూర్తం రాలేదని
కంకుభొట్లు పంచాంగం వల్లించినా
పాంచాలి పరాభవానికి
ఉడుకెత్తిన నెత్తురు నిండిన
నవశక్తులు సాయుధమై
సమరభూమికి సాగినై

# ధనుర్ధారీ బహూపరాక్

కొండకొన కొమ్మున
కొమ్మలపై నిలబడి
నలువైపులా సింహావలోకనం
చేస్తున్న ధనుర్ధారీ బహూపరాక్.

ఈ రాజ్యానికి మూలం ఆస్తి
ఆ ఆస్తికి బాట అక్రమం.
మూడు పువ్వులు ఆరు కాయలుగా
అసలును ద్విగుణీకృతంచేసే వడ్డీ,
కష్టించేవాడి స్వేదం కరుడుగట్టి
గల్లా పెట్టెలో ఎత్తిన
లాభపు అవతారం,
ఈ కలిమిలేముల తులాభారంలో
నాటికి ఏనాటికీ ఎప్పుడూ
ఒకే ప్రక్కన మొగ్గుచూపే
తూకపు దగాను వేలెత్తిచూపిన
నీపై కత్తిగట్టిన రాజ్యం
పహారా హుషార్, బహుపరాక్
ధనుర్ధారీ బహుపరాక్.

అన్నా ఎక్కుపెట్టిన నీ వింటి
బాణం రామబాణం
లక్ష్యాన్ని ఛేదించి తీరుతుంది
కుడి ఎడమల మాయలేళ్ళతో
నీ గురి సడలనీయకు
ఆశయం నీ ధనుస్సు
ఆగ్రహం నీ వింటినారి
శత్రువుపై ద్వేషం నీ శరం
గురితప్పనీయకు
బహుపరాక్ ధనుర్ధారీ
బహుపరాక్.

యుగయుగాల దోపిడి
చవిచూచి చితికిన
నీ గుండెల రాతిబండల్లో
కారుణ్యపు జలలూరవు
క్రౌర్యానికి ప్రతీకారం క్రౌర్యం

బహూపరాక్. ధనుర్ధారీ
బహూపరాక్.

పల్లెల్లో పెచ్చులు, నాగులు
పట్టణాల్లో చక్రవడ్డీలు
జిహ్వా సహస్రాల నాలుకల
చీలిన అంచుల లాభాలు
అడుగడుగునా కాటేసూ
అహింస వల్లిస్తూ
తోడేళ్ళమందలై చరిస్తుంటే
నీ కంటికి కునుకులేదు
ధనుర్ధారీ బహూపరాక్.

ఇక్కడ మా చట్టాల చక్రాల
రాజ్యంలో కోర్టుల జల్లెడల్లో
తాలుమినహా గింజలు
రాలడమేలేదు.
వోట్ల పెట్టెల మెట్లెన్ని ఎక్కినా
సుఖమయస్వర్గం ఎండమావులుకాగా,
ఈ రాజ్యపు కోర్టుల్లో న్యాయపు
తక్కెడ ఎప్పుడూ చిన్నచూపే చూడగా
పులుల భయం ఆవరించి
మా వారంతా గుహలకు కావలికాగా,
భుక్తావశేషాల వ్యామోహం
వోట్లలో వాటాదార్లను చేయగా,
ఎన్నటికి తెలవారని చీకటిలో
చిట్టడవుల నడుమన
నీవు వెలిగించిన దీపం పదిలం
ధనుర్ధారీ బహూపరాక్.
నీవు వెలిగించిన దీపపు ఎరుపు
మా నిరాశామయ జీవితాల్లో
భయాల కుడ్యాలను ఛేదించుక

ఉదయార్కుని కాంతులతో
నలుమూలలా ప్రసరించింది.
నేడో రేపో మేమూ నీతోనే

ఈలోగా బహుపరాక్
ధనుర్ధారీ బహుపరాక్

# ప ర శు వు

కంటకావృత పథంలో
రక్తసిక్త పాదాలతో
తడబడక అడుగువేసే
అర్ధనగ్న మూర్తుల నివహపు
అగ్రభాగాన నడిచే
పరశుధారీ మండే నీ గుండెల
బండలపై సానబట్టుకువచ్చావా
నీ శస్త్రాన్ని.
ఆయుధంపట్టిన నీ పిడికిలి
బిగువే నీ దృఢసంకల్పానికి నిదర్శనం,

రాజ్యాంగపు దుర్గంలో
తలదాచుకొన్నాడు శత్రువు.
అమ్ముడుపోయిన మేధస్సుల బురుజులపై
అనవరతం నిఘా.
నిశ్చేతన సామాజిక కలాలునిండిన
శాసనాల అగడ్త చుట్టూ
ఈవల మోహరించిన
ఆయుధోపజీవుల పహరా
అవన్నీ అధిగమించినా
అవకాశవాదపు పాచితో
జారుడుబండలైన గోడలు

నీ నిబ్బరపు ఉడుము విసరి పై కెగబ్రాకు
కోటలో పాగావేసిన మనవాళ్ళు
అదనుచూసి కలుస్తారు మనల్తో
విజయోత్సాహంతో
శత్రువును చెయిజారనీకు
చరిత్ర వధ్యశిలపై మోపితే
శత్రువు శిరస్సును
ఒక్కవేటుతో తెగటార్చు
ప్రజల తీర్పు శిరోధార్యత్వ

## బరిశ

కాననాల్లో, కోనల్లో నోరెరుగని
నీ జీవాలను కబళించవచ్చిన
మెకాలను గుచ్చెత్తిన బరిశ,
నరమాంసం మరిగిన
బెబ్బులిగుండెలు చీల్చిన బరిశ
పర్వత పార్శ్వాలపై నీవు నాటిన
దుంపలమడులను మెక్కవచ్చిన
వరాహాల డొక్కలుచీల్చిన బరిశ
నేడు గోముఖవ్యాఘ్రాలైన దళారుల
ఎదల్లో దూసుకుపోతున్నది.
అమ్మబోతే అడివై, కొనబోతే కొరివై
నీ గోళ్ళూడగొట్టి రాల్చుకొన్న
గల్లాపెట్టల గుండెలు చీలుస్తున్నది,
నీ చేతికి ఊతమై
నీ శత్రువు ప్రక్కలో బల్లెమై
అన్యాయాన్ని మొదలంటా
కెళ్ళగిస్తున్నది.

# ముగింపు

ఇది సార్వత్రిక సమరం
సర్వ భూమండలం మా క్షేత్రం
బాణాలు, బరిశలు దూసుకుపోతున్న వేళలో
మా మోటుచేతుల నాటుఆయుధాలు
నిప్పులుచెరిగే వేళలో,
విరుచుకుపడ్డ వైరిమూకలు
అగ్నిగోళాలు వర్షిస్తున్న వేళలో
నరుడివైతే ఆయుధంపట్టు
ఇంకా బృహన్నలవే అయితే
శత్రువు కొలువులో కైవారాలుచేయి
ఏమైనాసరే రేపు మాదే
రేపటి రోజున గెలుపు మాదే!

-శివకుమార

## ఒక ముఖ్యమైన విజ్ఞప్తి

సృజన డిస్ట్రిబ్యూటర్స్ ద్వారా పాఠకులకు మేము అందిస్తామని ప్రకటించిన పుస్తకాలన్నీ కాపీలు చెల్లిపోయినవి. చాలామంది పాఠకులు తిరుగబడు, అంపశయ్యల కొరకు రాస్తున్నారు. వారికి ఈ క్రింది అడ్రసులకు నేరుగా ఆ పుస్తకాల కొరకు రాయమని కోరుతున్నాం.

1. చలినెగళ్ళు, తిరుగబడు (రెండూ రెండు రెండు రూపాయలు)
   శ్రీ నెల్లుట్ల సంజీవరావు,
   స్వేచ్ఛా సాహితి, 6-551-3. బ్రాహ్మణవీధి, హనుమకొండ, వరంగల్-1.

2. 'అంపశయ్య' (వెల: ఐదురూపాయలు)
   శ్రీ నవీన్,
   6-3-117, రామగిరి, నల్లగొండ.

సమీక్షలు :

# చితి - చింత

[వచన కవితా సంపుటి]
రచన: వేగుంట రామమోహనప్రసాద్
ప్రచురణ: యం. శేషాచలం అండ్ కో.,
వెల రు. 3—50

T. S. Eliot Religion and Literature అనే వ్యాసంలో క్రైస్తవులు చదవడానికొకరకమూ, క్రైస్తవేతరులు చదవడానికి మరోరకమూ అంటూ సాహిత్యం రెండు రకాలుగా ఉండాలంటాడు. ఈ అభిప్రాయమే ఇటీవల కొందరు రచయితల్లో సాహిత్యం బుద్ధిజీవులకొకరకమూ, సామాన్యులకు మరొకరకముగా ఉండాలనేవిధంగా పరిణమించినట్లుంది. మోహనప్రసాద్‌గారి 'చితి—చింత' నిస్సందేహంగా బుద్ధిజీవులనుద్దేశించి రాసిందే. రోణంకి అప్పలస్వామిగారివంటి బహుభాషాజ్ఞానికికూడా ఏ శీర్షికనైనాసరే "పదేపదే చదివితేనేగాని కవి నిబిడీకరించిన అనుభూతి సరిగ్గా అర్థం కాదు" అంతటి దుర్గ్రాహ్యమైన వచనగేయ సంకలనమిది.

ఈ సంకలనంలోని గేయాలు వైయక్తిక అనుభూతితో నిండి, ప్రశాంత గంభీర తపస్సమాధిలో మునిగి ఈలోకానికి, ఈమనుషులకు అతీతమైన ఏదో అవ్యక్తబ్రహ్మానందాన్ని పొందే ప్రయత్నానికి వాహికలుగా మాత్రమే పనిచేశాయి. ఇందులో సామాజిక జీవనం, వర్గ చైతన్యం గురించిన ప్రసక్తిరాదు. వెదికి లాభంలేదు.

దాదాపు అన్ని (42) గేయాల్లోనూ దిగులు (Melancholy) అంతస్స్రవంతిగా ఉంది. అన్ని గేయాల్లోనూ కవిఅధ్యయనంవలనపొందిన ఒకదార్శనికతా(Philosophy) ఉంది. అయితే ఈ ఫిలాసఫీ పరిసరాలని, సమాజాన్ని ఆఖరికి యీ ప్రపంచాన్ని, అవి ఎంత దీనస్థితిలో ఉన్నాసరే వదిలిపెట్టి పారిపోయే పలాయనాధ్యాత్మికావేశంతో నింపుతుంది.

ఈ పలాయనాధ్యాత్మికావేశానికిమచ్చు :

ప్రకృతి శిక్షిస్తే......

హిమాలయ చిత్రాల మంచుసోనల నీడల్లో దాక్కుంటాను.
అక్కడొక్కచోటే మనిషి
జ్ఞాన నేత్రం తెరుచుకుంటుంది- (ఆలస్యం పేజి 14)

కేవలం చిత్రాల్లోని కృత్రిమ వాతావరణానికే జ్ఞాననేత్రం తెరుచుకుంటే వాస్తవమైందే అయితే ఆ "నేత్రం" సహస్ర దివ్య సూర్యప్రభాభాసురమై ప్రజ్వరిల్లుతుందేమో

ఈయచణ లోకంతో పనిలేదు—
నాకోసం దుఃఖాలు, నానించి దుఃఖాలు.
ఇంకా ఇతర విభక్తి ప్రత్యయ దుఃఖాలు
ఏవీ నన్నంటవు కాల్చవు ఎవరికీ జవాబుదారికాను. (ఆలస్యం-14)

అకడు దుఃఖాన్ని తాగినవాడు, 'అతడు శంకా కులితుడు. అతడి శంకలు 'సామాన్యులనే' అన్నీ సందేహాలే నూతు కావు; అవి తుచ్ఛమైన భౌతిక సమస్యలు, అతడివి ఉత్కృష్టమైన సుఖదుఃఖాల ద్వంద్వభావాలు, కూలిపోయే వంతెనలు మరీ స్పష్టంగా చెప్పాలంటే సామాన్యులకు కప్పుకోను రగ్గులేక శరీరానికి చలి అతడికి మన సంతా చలి. (దీపవృక్షం—పే. 49)

తనకూ ఆధ్యాత్మికతకూ అవినాభావ సంబంధమంటాడు 'సెల్ఫ్ పిటీ' (పే-11)లో
దేహం ఒకకొననుండి నాకోసం మండుతూ
వచ్చిన ఆధ్యాత్మికత మిమ్మల్ని కాలుస్తుందని
వెనక్కెనక్కెళ్ళిపోకండి. మంటకూ నాకూ మైత్రి పరి.

ఈ గేయంలోనే ఈ సౌమ్య సౌమనస్య సౌరభం గుబాళించే మానవత్వకొరకు తపనవ్యక్తపరుస్తాడు. చాల సంతోషం. కాని దాన్ని 'ఆత్మ' అవతరించేసరికి మమ్మల్ని కాలుస్తుందనే భయం తప్పక కలుగుతుంది.

ఈయన ఆధ్యాత్మికదృష్టి ఎంతవాడి అయినదంటే అవి నమిలిన కిళ్ళీలో, కాలిన సిగరెట్ లోసైతం ఆత్మలూ, ఆత్మాశ్రయపు వియోగపు పొగలను పసిగడ్తుంది. విచిత్రమేమిటంటే యీ చూపులోని చురుకుదనమే జాకెట్ జరీలో (బహుశమాటున) మామిడి పిందెలనూ చూస్తాయి. (వగపేటికి చల్లబిందినన్—పే-21) కవి ఆస్తిక్యపుధోరణి, పూర్వాపరజన్మలందలి నమ్మకము, విశ్వబంధు సర్వవ్యాపకత్వమూ, తుచ్ఛకాగితాల్ల మీద తనప్రేమను గొప్పచేసుకోవడమూ, 'అతీతం' పే-24 చూడవచ్చు. పలాయన వాదపు పరాకాష్ట వ్యక్తిపరమోక్ష కామిత్వమూ చూడండి ఇక- ఏగజ్జికుక్కకన్నె ఐదు

బుగ్గలా తన్నుకురానా నీవేగనుక / అర్ధరాత్రి ఒంతెనమీంచి పర్వెట్టే రైల్లోంచి నీవేలి ఉంగరం విసిరేస్తే /

ఇక్కడేముంది? "ఇక్కడున్నంతవరకూ నిట్టూర్పులే" (ఆలస్యం—15) నని అధ్యయనంద్వారా (Here, where men sit and hear each other groan—Keats) ను, చింతనంద్వారాను తెలుసుకున్నాడు. తననక్కడికి తీసుకెళ్లే రైలుబండి కోసం బ్రతుకంతా నిరీక్షించాడు." "ఇంతేనా ఈశ్వరా. ఇంకా కరుణించవా" అంటూ "ఊపిరికందని వాక్యవిన్యాసంలో, అర్ధరాత్రి ఆనందాన్ని చంపుకుని లయలో ఏడుస్తున్నాడు. (దీపవృక్షం-50) 'అక్కడి'కి తీసుకెళ్ళేరైలు కూస్తోంది. (పే-15)

యదార్థ జీవిత సమస్యల గురించి "భావనైశ్చల్యసమాధిలో ఉన్నవాణ్ణి"అడిగితే ఏంతెలుసు ఆయనకు "హృషీకేశానికి దారిఏదో" తెలుసు. తరచు తన "క్షేమము నరయు"చిన్మయానందస్వామీ, జీవన్ముక్తానందయోగి గురించి కూలంకషంగా తెలుసు. సామాన్యులగురించి తెలియదు (ఏదిదారి నాకు పే-31) ఆయన సర్వసంగ పరిత్యాగిత్వాన్ని శంకించనవసరంలేదు. ఆయన సౌభద్రార్జునుడుకాడు- త్రికరణశుద్ధిగా యతి అయినవాడు.

తనకు దొరికిన సినిమా పాటల చరణాలను తన దిగులుతోకలిపి మననంచేసుకుంటాడు (నిరీహ పే-1) లేదా వాంఛాజ్వాల ఎప్పుడో పూర్వపుది వెలిగించి కాస్తంత తేనీరుకాచుకుంటూ (సోసింపిల్ పే-19) గతంలోనే జీవిస్తాడు. అవునుమరి ఆయన "జ్ఞాపకాలన్నీ తుడిచేస్తే యింకెక్కడని నిలిచేది?" (అతీతం పే-25)

"ఏనాడూ శవాన్ని మర్చిపోకం"టూ (లేచి నిలబడు-87) అనుక్షణమూ మృత్యువును గుర్తుచేస్తూ బెదరగొట్టాడు. కార్యోన్ముఖులను, కర్తవ్యోన్ముఖులనూ చేయడం అటుంచి, "మీరందరు ఎక్కడ పనుల్నక్కడ వదిలేసి నాతోబాటు రండి" అంటాడు చుక్కల్లో తప్పటడుగులు వేయడానికి(పురందరదాసు పే-120). ఇలాంటివాణ్ణి, 'నెత్తురు మండే శక్తులు నిండే' యువకులు నమ్మితే ఏంచేస్తాడో, ముందుగానే స్పష్టంగా చెపుతున్నాడు:

ఎప్పుడో ఒకప్పుడు
నెత్తిన ముసుగేసుకుని
నేనీ చీకట్లోంచి
చల్లగా ఏ సన్యాసుల
మఠంలోనో
జాయినయిపోతాను (ఆఖరి ఆశ్రమం పే-4,5)

ఇంకొక్కమాట. కవిత్వం బూజుపట్టిన భావాలను, కుళ్ళిపోతున్న సమాజ వృక్షాన్ని సమూలచ్ఛేదంచేసి సమానధర్మపు(మా)నవసమాజాన్ని స్థాపించడానికితోడ్పడ వలసిన పదునైన కత్తి. ఈ కవి బాధ్యతారహితంగా అభిప్రాయపడినట్లు 'బతుకులో యాక్సిడెంట్' (కలలోపలి కల పే_110)కాదు. పలాయనవాదం కవిత్వానికి వస్తువు కారాదు. కలం పట్టదలచుకున్న ప్రతివాడు Wall whitman కు Phantom చేసిన బోధను మననం చేసుకోవాలి ;

> Know'st thou not there is but one theme for
> ever-enduring bards?
> And that is the theme of War, the fortune of battles,
> The making of perfect soldiers.
>
> (As I Pondered in Silence)

శేషాచలం కంపెనీ వేసాక గెటప్‌గురించి చెప్పాల్సిన పనిలేదు. చాలా విలువయిన గెటప్.

# స్పందన - వచన కవితా సంకలనం

[స్పందన_కవితాసంకలనం_80+8 పేజీలు 100 పైసలు. ప్రతులకు; స్పందన సాహితి. 1_8_17/2 చిక్కడపల్లి, హైదరాబాదు_20. నిర్వహణ: స్పందనసాహితి, హైదరాబాదు.]

(i) మంచిగారాసి, మంచిగా రాస్తున్న (ii) మంచిగారాసి, చెత్తరాస్తున్న (iii) ఎప్పుడూ చెత్త చెత్తగారాసే_పాతకవులూ, కొత్తకవులూ కలసి మొత్తం 47గురి 47 కవితల సంకలనం యిది. కొత్తవాళ్ళలో మరోవర్గంఉంది. వాళ్ళ కవితాప్రక్రియకు మాత్రమే కొత్త.

పుస్తకంమొదట 'సరికొత్తతరానికి స్వాగతం'రాసిన కుందుర్తి, నవకవులకు కొన్ని మంచి సూచనలుచేస్తూ, తమ వచన కవితోద్యమ ప్రచారం, అనవసర స్వోత్కర్షనుకూడా వీలయినచోటల్లా కుదించి నింపారు. యువకవులు సామాజిక చైతన్యంతో సంబంధంగల యితివృత్తాలను స్వీకరించాలన్నపుడు ఎటువంటి చైతన్యం? ఏ యితివృత్తం అన్నవిషయాలుకూడా స్పష్టంగా రాసి వుండవలసింది.

ఈ సంకలనంలోని ఖండికలలో-

- యివ్వాళటి కావ్యానికి ఛందస్సు-ఉద్యమం / కవిసమయం-

తిరుగుబాటు/విప్లవం, యీనాటి కావ్యానికి స్పందన (వరవరరావు)

—తిండీతిప్పలులేక/పస్తులతో పనిచేసే / కార్మికుడా ఓకార్మికుడా / కార్మిక రాజ్యము కొరకై విప్లవమే ధ్యేయమని సాగవోయి. (రాంపల్లి)

—పూరించండీ / వెలుగుబాట / తిరుగుబాటు శంఖారావం / మ్రోగించండీ. (ఎ. బి. కె. ప్రసాద్)

కవితలు విప్లవాన్ని, పోరాటాన్ని సూటిగాచెప్తూ—

—ఇప్పుడే స్వాతంత్ర్యానికి - ఇరువదిరెండేండ్లు / అణగారిన యవ్వనపొంగులు / పండిన కోర్కెల ప్రాణాల రంధ్రాలు / స్వాతంత్ర్యం ఎద రెపరెప కొట్టుకుంటోంది. (సైబ పరంధాములు)

—దరిద్రదేవత విలయతాండవం / ధనస్వామ్యపు శివతాండవం / కళ్లారా చూసినపుడు/అణువణువునా పొగలుసెగలు లేస్తాయి/అవే భవితవ్యం స్ఫురింపిస్తాయి స్పృశిస్తాయి, సృజిస్తాయి. (శ్రీమతి యలమంచి తాయారు)

—సమానతను నడివీధిలో చెరచి / మానవతను సజీవ సమాధిచేసి / నాగరికత ముసుగుల్లో మానవతనుమరచి /దొంగలా తప్పించుక / (చంద్రమండలానికి) పోకుంటే / మానవుడా ఎలా నాగరికుడనాలినిన్ను (ఎస్. ఎన్. చార్య)

—మీ పదవికి మీ పలుకుకు మీ కీర్తికి మీ దీప్తికి / బండారం పగులుననీ ఉన్నపేరు కూలుననీ / కులమతాల భేదాలతో కుంకుమబొట్టెట్టుకుని/మతకలహాలపేర మారణహోమం చేస్తారా? (అల్లంరాజు వెంకటరావు)

—కట్టెలుకొట్టేవాడి కసాయికుఠారంకింద / గట్టిగా గుట్టుగాపడివున్న చెట్టునుచూసి/ఒక జతగానికోల్పోతున్నానే అని కకావికలుపడుతున్న మరోచెట్టులా / ఉంది నా పరిస్థితి అంటున్న రాధాకిషన్ రామరాజువంటి కవులలో ఇంకా స్థిరమైన దృక్పదం ఏర్పడకున్నా, సమాజంపట్ల కవి బాధ్యతను గుర్తించివారుగా దాన్నిగూర్చి ఆలోచిస్తూ విమర్శిస్తూ—

నిఖిలేశ్వర్ యువతరాన్ని నిర్వచిస్తూ (దిగంబరతరం), మార్పురావాలని కోరుకుంటూ, మార్పురాకుండా అడ్డుకుంటున్న దానినిగూర్చి చెప్పకుండా అంతఃచింతనతో మనసుమారి మనిషిమారి అప్పుడు-సమాజం మారుతుందనే అమాయకధోరణిలో కొట్టుకుపోతున్న అద్దేపల్లి రామమోహనరావు (నాకు మనిషికావాలి) గార్ల కవితలు మార్పును కోరుతున్నకోవలో చేరేవి.

మరుభూమిలో శృంగినాదం (సోమసుందర్), నిశ్శబ్ద సంగీతం (అరిపిరాల విశ్వం), ఎవరిది (త్రిపురసుందరి), శ్రాంతి (సి. వి. కృష్ణారావు), గాలికి ఊయల ఊగింది (ఎ. సూర్యప్రకాశ్) మంచి కవితాత్మగల ఖండికలు.

పోతే, పలాయనవాదం, శుష్క వేదాంత బోధన నిండిన కాగితం పడవ (గుత్తికొండ సుబ్బారావు), దాశరథిరాసిన కలగూరగంప కవిత 'చంద్రాలోకం' గాంధీ శతజయంతి సందర్భంలో – దేశం నాశనమైపోతూంది గాంధీ! మళ్ళీ పుట్టి నువ్వే రక్షించాలి మహాప్రభో! మేము తోళ్లువేలాడిన తొత్తులమైపోయాం. నువ్వంటే ఇది చూసి ఆత్మహత్య చేసుకునేంత ఘోరంగావుంది అని తమ పిరికితనం ఆయన కంట గడుతూ సృష్టించబడ్డ వాగస్లికొద్ది నాన్సెన్స్ కవిత్వంలో చేరే డాక్టర్ తంగిరాల "బాపూజీ బ్రతికుంటే...?'' ఏ దృక్పథమూలేక తోచినట్లల్లా రాసుకుపోయే కె. శివారెడ్డి, గంధం జోయెల్‌గార్ల 'శపథం', 'సంస్కరణ', ముసలివాళ్లుకాగానే మామూలువాళ్లు రామా కృష్ణాఅంటూ కాలం వెళ్ళదీసినట్లు, కాలం చెల్లగానే కొందరుకవులు ప్రణయకవిత్వం రాస్తూ భావరతి జరుపుతారేమోననిపించే పురిపండా అప్పలస్వామి, జె. బాపురెడ్డిగార్ల 'సంధ్యావందనం' 'పత్రం–చిత్రం'. అభ్యుదయ కవిత్వాన్నికూడా సినీతత్వంనిండిన పదాలలోతప్ప వ్రాయలేనంత పదసౌందర్యారాధనలో మునిగిన డా॥ సి. నారాయణరెడ్డి 'మధ్యతరగతి మందహాసం' వగైరాలు ఉన్నాయి.

ఇది స్పందన సాహితివారి "తొలిప్రయత్నంగనుక కొన్నితప్పులుండొచ్చు". ఈసారి "అన్నిరకాల కవితలను పొందుపరిచి...విభిన్నదృక్పథాలను ఒకేవేదికమీదకు తీసుకురావడ"మనే అసమంజసంచేయరని ఆశించవచ్చు.

కొత్తవారికిచ్చిన ప్రోత్సాహం, తక్కువధరలో, అచ్చుతప్పులులేకుండా, మంచిగెటప్‌తో అందించటం ప్రశంసనీయం. రెండోప్రయత్నం కొనసాగడానికి సహకారం ఆశిస్తున్న వీరికి అది అందించవలసిన బాధ్యత పాఠకులపై ఉంది.

'మధ్యతరగతి మందహాసం'
డా॥ సి. నారాయణరెడ్డి
వెల : **3—50**

'చితి - చింత'
వేగుంట మోహనప్రసాద్
వెల : **3—50**

ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాద్
వద్ద లభించును.

# ఐదుగురు లోఫర్లు

క్రిషన్ చందర్

అనువాదం : నిడమర్తి ఉమారాజేశ్వరరావు
నిడమర్తి శ్యామలా దేవి

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
ఏలూరు రోడ్డు, విజయవాడ-2.

వెల: సాదా ప్రతి రు. 3-00. మేలు ప్రతి రు. 4-00.

నేటి భారత సమాజం లోఫర్లను తయారుచేసే అధునాతన యంత్రాగారం. ఈ యంత్రాగారం ఉత్పత్తిచేసిన కోట్లాది లోఫర్లలో ఐదుగురి గురించి వ్రాసిన నవలే "ఐదుగురు లోఫరు".

తాంతియా, బాస్కో, అబ్దుల్, జమున, పాంట్ మాస్టర్ మొదలయినవారు నవలలో ముఖ్యమయినవారు. తాంతియా దొంగతనం నేరంపై జైలుకు వెళ్ళి, విడుదలయి వస్తూ పెద్దమనిషిలా బ్రతకాలనుకోవడంతో మొదలవుతుంది నవల. కొద్దిరోజుల్లోనే తన ప్రయత్నం గాలిలో మేడలని తెలుసుకుంటాడు తాంతియా.

తాంతియా జైలునుండి వచ్చినరోజు పోలీసుకానిస్టేబులుకు సారా త్రాగించడానికై టైర్లదొంగతనానికి బాస్కోతో బయలుదేరిన అబ్దుల్ విచిత్ర పరిస్థితుల్లో జైలుపాలవుతాడు. అతికష్టంమీద గ్యారేజిలో ప్రవేశించిన అబ్దుల్ టైరును ఊడదీసేముందు కారులోపలికి టార్చివేసి దానిసీట్లు, దిండ్లు, రత్నకంబళాలూ చూసి అందాలరాకుమారి అంకతలంవలె ఉందనుకుంటాడు. దానిపై కూర్చోవాలని వాడికి మనసవుతుంది. టైరును దొంగిలించకపోవడానికి కారణమడిగిన జడ్జికి ఇలా సమాధానం చెప్తాడతను: "నాకు నిద్ర ముంచేసుకొచ్చింది దేవరా. స్వర్గంలోని ఉద్యానవనంలో ప్రవేశించినట్లూ స్వర్గసుఖాలు అనుభవించినట్లూ అనిపించిందండి."

బాస్కో చర్చికి నమ్మకమైన భక్తుడు. రోజూ కడుపులో నింపాల్సిన బ్రెడ్ కోసం దొంగతనం చేస్తుంటాడు. జేబుకొట్టినరోజు చర్చిలో మరిన్ని కొవ్వొత్తులు

వెలిగిస్తాడు. ఆడవాళ్ళను కొట్టడం పరమ కిరాతకం అంటాడు. కాని మేరీమాత నవమానించినందుకు జమున చెంప పగలగొడతాడు.

పాంట్‌మాష్టర్ యింటర్‌మీడియట్ ప్యాసై "నిరుద్యోగమనే కుష్ఠు"రోగంతో వీళ్ళలో చేరతాడు. ఈయన కథలూ, గేయాలు (సినీగేయాలూ తెరవెనుక పాడబడని) వ్రాస్తాడు. లోఫర్లకు నాడీకణంలాటివాడు.

జమున కడుపు మాడ్చుకోలేక "మాంసం" అమ్ముకునే భారత నారీరత్నం. తన గర్భంలో బిడ్డెవరో తెలియకపోయినా, బిడ్డకు వొక తండ్రి కావాలని ఆశపడే అభాగ్యురాలు. తాంతియా తల్లి దహనంకోసం నాలుగు రూపాయలు సంపాదించడానికి నాలుగేళ్ల మునలిదైపోవడానికైనా సిద్ధపడే వేశ్య జమున.

వీళ్ళతోపాటే మరోకుష్ఠురోగిజాన్ ఫుట్‌పాత్‌పై నివసిస్తుంటాడు. మధ్యలో మాజీ సినీ హీరో ప్రేమవర్మ లోఫర్లలో చేరతాడు. ఈయన కాన్సర్‌రోగి. జమున బిడ్డకు తండ్రికావడానికి సిద్ధపడి మన సానుభూతిని సంపాదిస్తాడు.

నెహ్రూ మరణించినరోజున మన ఐదుగురు లోఫర్లకు బడాపేపరు పత్రికా విలేఖరైన శాంతాకౌల్ పరిచయమవుతుంది. నెహ్రూ చావువల్ల విచారంతో కుష్ఠుజాన్ ఆరోజు బిచ్చమెత్తనంటాడు. శాంతపర్సు దొంగిలించిన లోఫర్లు తాము తక్కువకాదని పించుకోడానికి పర్సు తిరిగి యివ్వడానికి నిశ్చయించుకుంటారు. కాని నెహ్రూచచ్చినా బతికినా వాళ్ళ పేగుల్లోని ఆకలి చావదుగదా! కాని పర్సు తెరుద్దామనేధైర్యం ఎవడికీ వుండదు. భావవాదుల సిద్ధాంత రాద్ధాంతాలూ, ఆత్మలూ, పరమాత్మలూ, అఖండ విశ్వాత్మలూ పదార్థంతో సంబంధంలేని ఆలోచనలూ యిక్కడ పనిచేస్తే బావుండును. కాని యిక్కడికి వచ్చేసరికి అవి తోక జాడిస్తాయిగదా? అందువల్ల లోఫర్లు పర్సు తెరవక తప్పదు.

బతకడంకోసం కొంతమంది తక్కువస్థాయిలో పతనమవుతారు. శాంతా కౌల్ పతనస్థాయి అధికమయింది. అందుకే "అమాటకువస్తే ఈ ప్రపంచంలో వొళ్ళు అమ్ముకోని స్త్రీ ఎవరుంది?"అన్న పాంట్‌మాష్టర్ ప్రశ్నకు ఉలిక్కిపడుతుందామె. తన స్థాయి పెరుగడానికి తన అందాన్ని వినియోగిస్తుందామె. కాని పాంట్‌మాష్టర్‌ను ప్రేమించానని తెలుసుకుని, తిరస్కరించబడిప్పుడామె హృదయవిదారకంగా యేడుస్తుంది. అయినా పాంట్‌మాస్టర్ ఆమెనూ, ఆమె ఆశ్రయంవల్ల లభ్యమైన స్వర్గ సుఖాలను వదిలేసి ఫుట్‌పాత్ జీవితానికే తిరిగివస్తాడు.

నెహ్రూ చనిపోయినరోజు విటులకోసం తన మామూలు ప్రాంతానికి వచ్చిన జమునను జుట్టుపట్టుకుని తన్నడానికి సిద్ధపడుతుంది డేజీఅనే మరో వేశ్య. దొంగలనీతి

నియమాలు నిలపడంకోసం బాస్కో దొంగసొమ్ములు కొనేవాడి తమ్ముడి కారు షైరులే హొంగిలిస్తాడు. ఇది తెలీక చేసినపనే. చవుకబారు కథలు వ్రాసి 4, 5 రూ॥లు సంపాదించే పాంట్ మాస్టర్ 50 రూ॥ల కోసం చావుకు సిద్ధమవుతాడు. కాన్సర్‌రోగి ప్రేమ వర్మకు నొవాల్జిన్ టాబ్‌లెట్ కొనలేక అతనిఅన్న తమ్ముడ్ని ఫుట్‌పాత్‌మీద పడేసిపోతాడు. తాంతియా తల్లి బిచ్చమెత్తుకోడమే గౌరవమంటుంది. దేశంలో ఆపని చేయనివాడే లేడంటుంది. తమ వంశం మూడు తరాలనుండి బిచ్చమెత్తుకుంటున్నారంటుంది. "మూడుతరాలు-అంటే రాజా రామమోహనరాయ్ తరంనుండి మహాత్మా గాంధీ తరం వరకు; ఆంగ్లేయ సామ్రాజ్యంనుండి, భారతీయ స్వాతంత్ర్యం వరకు, జాగీర్దారీ విధానంనుండి మిశ్రమ పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థవరకు". శాంతాకౌల్‌చుట్టూ వున్నది మరో సమాజం. సినీహీరోలు, లింకు పత్రికల ఎడిటర్లు, పెట్టుబడిదారులు, కుక్కతోకలతో మోడ్రన్ బొమ్మలువేసే ఆర్టిస్టులు, అక్రమప్రేమ సంబంధాల కథలు ప్రచురించే పబ్లిషర్సు శాంతచుట్టూవున్న ప్రపంచంలోని జీవులు(పరాన్నజీవులు).మంచి మనిషిగా బతకాలనుకునే తాంతియా విఫలుడై చివరికి తల్లి దహనానికికూడా డబ్బు సంపాదించలేకపోతాడు. మన లోఫర్లంతా ఆప్రయత్నంలోంచి విఫలమైతారు చివరికి మునిసిపాలిటీవాళ్ళతో చనిపోయింది తనతల్లే కాదంటాడు తాంతియా.

క్లుప్తంగా చెప్పాలంటే సమాజంయొక్క వాస్తవికతను కళ్ళకు కట్టేట్లువ్రాసిన నవల యిది.

ఈ సమాజాన్ని రూపొందించిన బాధ్యత నెహ్రూ సోషలిజానిదే. ఆవిషయం రచయితే అంగీకరిస్తున్నాడు. ఈ సామాజిక పరిస్థితికి పరిష్కారం రేఖామాత్రంగానైనా చూపించాల్సినబాధ్యత రచయితకులేదా? అంటే ఆబాధ్యతను రచయితవదిలేశారు.

ఈ లోఫర్లను తయారుచేసే దోపిడీవ్యవస్థ చట్టాలతో మారుతుందా? లోఫర్లు మనుషులుగా మారాలని అరచినంతమాత్రాన చట్టాలు చేసినంతమాత్రాన వేశ్యావృత్తిని కలంపోటుతో రద్దుచేసినంతమాత్రాన, దొంగలకు జైలుశిక్షవేసినంతమాత్రాన "మరో ప్రపంచం" రాబోదు. దొంగతనం, వేశ్యావృత్తి చట్టంద్వారా యెలా రద్దుకావో, వర్గ దోపిడీ భూస్వామ్య యెస్టేట్లూ అలాగేరద్దుకావు, ఈ సమాజానికి పునాదిరాళ్ళే అవి అయినప్పుడు చట్టం ఏమిచేయగలదు? అలాంటప్పుడు లోఫర్లంతా తాంతియా తల్లిలా కుక్కచావు చావాల్సిందేనా? వీల్లేదు. ఈసమాజాన్ని పునాదుల్తోసహా బద్దలుకొట్టగల మార్గం కావాలి, ఆ మార్గం రక్తమయంకావడం అనివార్యం.

ముందుదారిచూపని ఈ నవల సమాజాన్ని చక్కగా చిత్రించింది. ప్రింటింగ్ బావుంది. తెలుగులోచదువుతుంటె అనువాదం చదువుతున్నామనిపించదు.

# నీలం నోట్ బుక్
(నవల)

మూలం; ఇ. కజకెవిచ్

తెలుగు: నిడమర్తి ఉమారాజేశ్వరరావు

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
ఏలూరురోడ్, విజయవాడ-2.
వెల: 2-50

ప్రపంచ కార్మిక వర్గానికి ప్రియతమ నాయకుడు. అధ్యాపకుడైన లెనిన్ రహస్య జీవితకాలంలో కొంతభాగాన్ని వివరించిన బయాగ్రఫికల్ నవలే "నీలంనోట్ బుక్". రాజ్యాంగయంత్రంపై మార్క్స్, ఎంగెల్స్‌లు వ్రాసిన రచనలనుండి ముఖ్యాంశాలను లెనిన్ వొక నీలం నోట్ బుక్‌లో వ్రాసుకున్నారు. రహస్యజీవితానికి వస్తూ ఆ బుక్‌ను తన భార్యదగ్గర వదలివచ్చాడాయన. రష్యన్ కార్మికవర్గ పోరాటం అతిక్లిష్టపరిస్థితిలో ఉన్నప్పుడు దీనికోసం ఆయన తహతహలాడిపోయాడు. ఆసమయంలో రాజ్యాంగ యంత్రస్వభావాన్ని శ్రామికవర్గ దృక్పథంతో వివరించవలసిన అత్యవసర కర్తవ్యమే వ్లాదిమిర్ తహతహకు కారణం.

1917 ఫిబ్రవరిలో రష్యన్ బూర్జువా ప్రజాతంత్ర విప్లవం విజయం పొందింది. అధికారం శ్రామికవర్గ హస్తగతంకాలేదు. ఆసమయంలో లెనిన్ రష్యాలోలేదు.

బూర్జువా కెరెన్‌స్కీ ప్రభుత్వం జర్మనీ ఏజంటనే పేరుతో లెనిన్‌ను నిర్బంధించి హత్యచేయడానికి ప్లానులు సిద్ధంచేసింది. లెనిన్ను కాపాడవలసిన విప్లవకర్తవ్యం సోవియట్ కమ్యూనిస్టు పార్టీపైబడింది. ఆరోజుల్లో ఆయనను రజ్లీవ్ సరస్తీరంలో దాచారు, ఒక కార్మికుడీపనిని విజయవంతంగా నిర్వహించాడు.

రష్యన్ శ్రామికవర్గపోరాట అంతిమదశలో లెనిన్ జీవితం ప్రమాదభరిత స్థితిలోవుంది, బోల్షివిక్కుల నాడీకేంద్రం లెనిన్. అ నాడీకేంద్రాన్ని రూపుమాపడానికి కొన్ని వేలమంది బూర్జువా రహస్య పోలీసులు కుక్కల్లా తిరుగుతున్నారు. అలాంటి పరిస్థితుల్లో ఎమెల్యానోవ్, అతని భార్య, నలుగు కొడుకులూ లెనిన్‌ను కంటిరెప్పలా కాపాడారు. వారి విప్లవదీక్ష, త్యాగములేకపోతే విప్లవానికి లెనిన్ నాయకత్వమేలేదు.

రహస్య జీవనకాలంలో పదమూడేళ్ళ ఎమిల్యానోవ్ కొడుకు కోల్యా లెనిన్‌కు ఆప్తమిత్రుడవుతాడు లెనిన్‌లాంటి మేధావి కార్మికులలో కలసిపోయి వాళ్ళలో

ఒకడిలా యెలా మెలుగుతాడో మనం గమనిస్తాం. పిల్లలపట్ల ప్రేమ, ఆప్యాయతలతో లెనిన్ ప్రవర్తించే తీరూ, భవిష్యత్ శ్రామిక రష్యా గురించి చమత్కారంగా వారికి వివరించే పద్ధతినీ గమనిస్తాం. ఎమెల్యనోవ్ పత్ని లెనిన్‌ను తన ప్రాణంగా భావిస్తుంది. లెనిన్ వారి కుటుంబంపట్ల ప్రదర్శించే ఆప్యాయతకూ, కలుపుగోలు తనానికీ ఆమె చలించిపోతుంది.

సిగరెట్టు కాల్చితే రహస్యజీవితంలో కలిగే కష్టాల్ని ముందే గుర్తించినలెనిన్ వాటి జోలికేపోడు. ప్రతి చిన్న విషయాన్ని ఆయన పరిగణనలోకి తీసుకోవడం మనకు ఆసక్తి కలిగించేవిషయం. కార్మికుల వ్యక్తిగత కుటుంబవిషయాల దగ్గరనుండి మహత్తర రష్యన్ విప్లవంవరకు ఆయన శ్రద్ధగా ఆలోచించేవాడు. ఆయనకుగల దూరదృష్టి, ప్రజలపట్లగల విశ్వాసం అచంచలమైనది. జినోవీవ్ నిరాశను ఖండిస్తూ, ప్రజల ఉనికియొక్క వాస్తవికతకూ, వారు తాగుబోతులై, నిరాశావాదులయినా, బద్ధకస్తులయినా, వర్గచైతన్యరహితులైనా వారిద్వారానే విప్లవలక్ష్యాన్ని పూర్తిచేయాల్సిన బాధ్యతను వివరిస్తూ జినోవీవ్‌ను మందలిస్తాడాయన

వర్గరాజ్యాంగ యంత్రస్వభావం, విప్లవం మొదలయిన విషయాలపై లెనిన్ భావాలు తిరిగదోడబడ్డాయీనాడు. బూర్జువా రాజ్యాంగయంత్రం బలప్రయోగంద్వారా కూలద్రోయబడనిదే శ్రామికవర్గ రాజ్యాంగయంత్రం ఉనికిలోకి రావన్నది లెనిన్ అవగాహన. కాని నేడు బూర్జువా రాజ్యాంగ యంత్రాన్ని శాంతియుతంగా శ్రామికవర్గపరం చేసే మాంత్రికులు పుట్టారు. పైగా వీరు తామే లెనిన్ వారసులని దబాయిస్తున్నారు.

కెరన్‌స్కీ ప్రభుత్వం లెనిన్ జర్మనీ ఏజంటనీ, కోర్టుకురాకుండా పారిపోయాడనీ చేసిన విషప్రచారానికి కొంతమంది నిజాయితీగల కార్మికులుకూడా లోను

---

వరంగల్‌లో విప్లవ సాహిత్యమూ, పత్రికలూ దొరుకుచోటు:

**శ్రీ రాజమౌళి, కాశీబుగ్గ, వరంగల్-2**

సృజన, ప్రభంజనం, విద్యుల్లత, లాంగ్‌మార్చ్, వాహిని పత్రికల కోసం
ఝంఝ, మార్చ్, దిక్‌సూచి పుస్తకాల కోసం యిక్కడ అడగండి.
విప్లవ పత్రికా నిర్వాహకులు, ప్రచురణకర్తలు సోల్ ఏజెంటుగా-
శ్రీ రాజమౌళి, కాశీబుగ్గ, వరంగల్-2 ను నియమించుకోండి.

రావడం లెనిన్‌ను కలవరపరిచింది. బూర్జువాకోర్టుకు హాజరయి తన వాదనలద్వారా వారిని చీల్చి చెండాడుదామనుకుంటాడు కొద్దిసేపట్లోనే బూర్జువా కోర్టులయొక్క వర్గ స్వభావం తలపుకురాగానే, తన ఆలోచనయొక్క హాస్యాస్పదమైన స్థితికి తనే నవ్వుకుంటాడు.

మన దేశంలో కమ్యూనిస్టులమని చెప్పుకునే కొందరు దేశ న్యాయస్థానాలపట్ల చట్టాలపట్ల విపరీతమైనభక్తినీ, శ్రద్ధనూ ప్రదర్శిస్తున్నారు. లేదా వాటిని బుజ్జగించో బెదిరించో రక్తపాతం లేకుండానే లొంగదీయాలనుకుంటున్నారు. రాజ్యాంగయంత్రం పట్ల శ్రామికవర్గ దృక్పథాన్ని ఖూనీచేసిన ఘనత వీరికి దక్కింది. పెట్టుబడిదారులకూ, భూస్వాములకూ, కాంట్రాక్టర్లకూ, వారి తొత్తులకూ ఊడిగంచేసే న్యాయస్థానాలు తుపాకులతో నిర్వహించబడుతున్నప్పుడు దోపిడీవర్గ న్యాయం నాశనంకానిదే మానని శ్రామిక మధ్యతరగతి స్థితిగతులమార్పు శాంతియుత పరివర్తనద్వారా సాధ్యమౌతుందా?

'నీలం నోట్ బుక్' ద్వారా కజకేవిచ్ లెనిన్‌ను మనకు మరీదగ్గిర చేశాడు. దీన్ని తెలుగులో వ్రాసిన ఉమారాజేశ్వరరావు యిలాంటి పుస్తకాలు వ్రాసి తెలుగు సాహిత్య పురోగతికి దోహదంచేస్తారని ఆశిదాం.

## లాంగ్ మార్చ్

(విద్యార్థుల ద్విభాషా పక్షపత్రిక)
విద్యార్థులకోసం విశాఖ విద్యార్థులు నడుపుతున్న పత్రిక.
వెల: 25 పైసలు.

దేశ పురోభివృద్ధిలో విద్యార్థుల పాత్రగురించి విచారించాల్సిన పనిలేదు. అలాంటి విద్యార్థులకు లాంగ్‌మార్చ్‌లాంటి పత్రికలు యెన్నున్నా చాలవు. కాని అసలు పత్రికలంటూ లేనిస్థితిలో లాంగ్‌మార్చ్ మన మధ్యకు వచ్చింది.

లాంగ్‌మార్చ్ విద్యార్థులపక్షాన నిలబడే పత్రిక. విద్యార్థుల్లో అజ్ఞానాన్నీ, నిరాశనూ రూపుమాపడం, తమన్యాయమైనహక్కులకోసం పోరాటం నడిపే విద్యార్థులకు బాసటగా నిలవడం. సామ్యవాద సమాజస్థాపనకు తోడ్పడడం లాంగ్‌మార్చ్ ఆశయాలు.

షెడ్యూల్ కులాల హీనస్థితి తమకు ప్రత్యేక హక్కులున్నంతమాత్రాన మారదని, శ్రామికవర్గంతో కలిసి వర్గపోరాటం నడపడమే వారికి మార్గమని ఉద్బోధిస్తోంది లాంగ్ మార్చ్.

విద్యాలయాల్లో కరుడుగట్టిన కుల, మతత్వాలను చీల్చి చెండాడుతోంది. కుళ్ళిపోయిన ఈ వ్యవస్థ మార్పడానికి విద్యార్థి పోరాటాలు అవసరమంటోంది. తీవ్రవాద విద్యార్థులతో జరిపిన ఇంటర్వ్యూను ప్రకటించి విద్యార్థులకు లాంగ్ మార్చ్ యిక్రింది సందేశాన్ని యిస్తోంది.

"ఈనాడు సంస్కరణలు వృథా. సామాజిక విప్లవం ఒక్కటే శరణ్యం"

లాంగ్ మార్చ్‌లోని "విద్యార్థులు రాజకీయాల్లో పాల్గొనవచ్చునా?" అనే చర్చావేదిక విద్యార్థులకు ఉపయోగకరంగా ఉంది. పత్రికలో చేకూరి రామారావుగారు వ్రాసినట్లు గ్రాంధిక భాషను పాఠ్యపుస్తకాలనుంచి తరమడానికి విద్యార్థులు ఉద్యమం నడపాల్సిందే.

"అడవుల్లో, చీకట్లో
గర్జిస్తున్నాయ్ సింహాలు"

లాటి గేయాలద్వారా ప్రజా పోరాటాలకు తన చేయూతనిస్తోంది లాంగ్‌మార్చ్. లాంగ్ మార్చ్‌లో పెత్తందార్లు సినిమాపై సమీక్ష బాగుంది. ఇంగ్లీషుభాగంకూడా ఉపయోగకరంగావుంది.

లాంగ్ మార్చ్‌లో నానా గోత్రీలకు అభిప్రాయాలు యివ్వాలని ప్రయత్నించడం సబబుకాదేమో. పేపరు క్వాలిటి పెంచడమేకాక, Contentయొక్క qualityని నిలబెట్టుకోడం అవసరం.

విద్యార్థులు దేశ భవిష్యత్తును నిర్ణయించే శక్తిగా మారడానికి వారు యెంతో అభివృద్ధిపొందాల్సిన అవసరం ఉంది. వారి ఆలోచనాప్రపంచాన్ని వృద్ధిచేయడంలో లాంగ్ మార్చ్ కృషిచేస్తుందని ఆశిద్దాం.

ఈ రోజుల్లో పత్రిక నడవడం తేలికైనవిషయంకాదు. ఆర్థిక యిబ్బందులు మామూలే. అందువల్ల లాంగ్ మార్చ్ నిర్వాహకులు విరాళాలను కోరుతున్నారు. పంపదలుచుకున్నవారు క్రింద అడ్రసుకు పంపవచ్చు.

మేనేజరు, లాంగ్ మార్చ్, 11-9-3. ప్రకాశరావు పేట – విశాఖపట్నం.

—ఆర్. వి. ఆర్.

మిఠాయీలు కాదు
విద్యార్థులకీనాడు పంచాల్సినవి
విప్లవ భావాలు
ఆయుధాలవంటి ఆలోచనలు

—సుధాకర్.

మినీప్రశంస:

# అంపశయ్య

ప్రయోగం ప్రతీదీ పిచ్చికాదు. ప్రయోగం ప్రయోగంకొరకే పరిమితమై ప్రయోజనరహితమయినపుడు అది పిచ్చి. అంపశయ్య ప్రయోగాత్మకమయిన (అట్లా ప్రచారంచేసి పబ్లిషర్స్ ఆ నవలకు అన్యాయమేచేసారు) నవలమాత్రమేకాదు ప్రయోజనాత్మకమయిందికూడ. తెలుగు కవిత్వంలో దిగంబరకవుల ప్రయోగాలు ఎట్లా కుళ్ళిపోయిన, నిల్వనీళ్ళయిపోయిన తెలుగు కవితా ప్రవాహాన్ని కదిగేశాయో, అట్లాతెలుగు నవలా సాహిత్యాన్ని నిర్భయంగా, సాహసికంగా. చిత్తశుద్ధితో కడిగేసినఘనత అంపశయ్యది. ఇద్దరికీ ఆయుధంబూతే, అయితేనేం వజ్రాన్ని వజ్రంతోనే కోయాలిగదా. ఈ బూతుసమాజాన్ని బూతుతోనే 'వ్యాక్సినేట్' చేసారు. వాళ్లూ కొన్ని పిచ్చిపనులు చేశారు. దిగంబరకవులు అని పిలిపించుకోవడం, ఆ సన్యాసులపేర్లు, అర్థంలేని రుతువులు, తమ కవిత్వాన్ని దిక్‌లంటామనడం వంటి పిచ్చిప్రయోగాలు కేవలం సెన్సేషన్ కొరకే మొదటి రెండు సంపుటాల్లో ఏన్నోచేసారు. అయినా యీ పిచ్చిమాటున చాల స్పష్టంగా కనిపిస్తున్నవాళ్ళ righteous anger తెలుగు దేశాన్ని నిద్రలేపింది, అంపశయ్యలోనూ 18గంటలజీవితం, చైతన్యస్రవంతి టెక్నిక్, అడాలసెంట్ యేజ్‌లో వుండే భ్రమలు, అయిడయిలిజం-అన్ని పిచ్చులూ వున్నాయి. కాని దానివెనుక ఈ నాటి విద్యావిధానంలోని డొల్లతనం, నిష్ప్రయోజకత, కుట్ర చాల సూటిగా, స్పష్టంగా బలంగా కనిపిస్తున్నాయి. అందుకే యూనివర్శిటీ విద్యార్థులకు 'అంపశయ్య' హాట్‌కేక్ అయింది. దిగంబర కవుల ప్రయోగాలన్నీ ఒక మహత్తర ప్రయోజనంలోకి మూడవ సంపుటిలో కల్మినేట్ అయినట్లు అంపశయ్య చివరన హోటల్ సీన్‌లో కర్తవ్యనిర్దేశం వున్నది. నవీన్ మళ్ళీ రవి 'నిరుద్యోగపర్వాన్ని' రాస్తాడని, నిరుద్యోగంలో యీనాటి విద్యార్థిచేసేది ఉద్యోగ(ప్రయత్న) మేనని, ఉద్యోగఫలితం యుద్ధమేనని మహాభారతం నుంచే మళ్ళీ (అంపశయ్యవలె) నవీన్ తెలుసుకుంటా (కున్నా)డని, ఆయన 'కురుక్షేత్రా'న్ని రాస్తే ఆనందంగా స్వీకరిస్తామని ఎదురుచూస్తున్నాం.

-కె. వెంకటనారాయణ.

# విప్లవకారుని వీలునామా

మేజర్ ఎర్నెస్టో చే గువేరా ఫైడెల్ కాస్ట్రోకు వ్రాసిన చరిత్రాత్మకమైన వీడ్కోలు లేఖ.

పరిచయం:

ఎర్నెస్టో చే గువేరా జన్మించినది అర్జెంటినాలోని గోసారియోలో 1928 జూన్ 14న. తండ్రి ఐరిష్, తల్లి స్పానిష్ జాతీయులు.

పుట్టుకనుండికూడా గువేరా శారీరకంగా బలహీనుడు. రెండవ ఏట పట్టుకున్న అస్తమా అతన్ని తుది క్షణందాకా వెన్నంటేవున్నది ఈ లోపంవల్ల తల్లివద్దనే ఓనమాలు నేర్చుకున్న గువేరా విద్యార్థిగా అసాధారణప్రతిభ కనపరచి 25వ ఏట 1953 లో వైద్యశాస్త్రంలో పట్టభద్రుడయేడు.

విద్యార్థిదశలో గువేరా విరివిగా పర్యటనలుచేసి వివిధప్రాంతాల ప్రజలను గురించి ప్రత్యక్ష పరిజ్ఞానం సంపాదించేడు. ఈ పర్యటనల ఖర్చులకోసం పోర్టర్‌గా నావికుడుగా, పళ్ళేలు కడిగేవాడుగా రకరకాల ఉద్యోగాలూ చేశాడు.

డాక్టర్‌పట్టా పుచ్చుకున్న వెంటనే క్యూబాకు బయలుదేరిన ప్రథమ విమోచన విప్లవదశలో డాక్టర్‌గా చేరి తన వీరోచిత కృత్యాలతో అనతికాలంలోనే గొప్ప గెరిల్లా యోధుడుగా, నాయకుడుగా గుర్తించబడ్డాడు.


ఝంఝ ఝంఝ ఝంఝ ఝంఝ

విప్లవ రచయితల ఝంఝ, వి. ర. సం. ఝంఝ

విప్లవ రచయితల సంఘం తొలి కవితా ప్రచురణ

ఝంఝ

వెలువడింది. వెల: ఒకరూపాయి

సంకలనకర్త:- కె. వి. రమణారెడ్డి.

ప్రతులకు:- 46, విద్యానగర్ కాలనీ, హైదరాబాదు - 13.

కాస్ట్రో మాటల్లో గువేరా ఒక "సాటిలేని యోధుడు: యుద్ధ వ్యవహారాలలో అసాధారణమైన సాహసోద్రేకాలుగల గెరిల్లా!" కనుకనే గువేరా అనతికాలంలోనే క్యూబన్ ప్రజలకూ, విప్లవకారులకూ ప్రియతముడైనాడు. క్యూబన్ విప్లవ విజయానంతరం పునర్నిర్మాణ కార్యక్రమంలో ప్రముఖపాత్ర వహించాడు.

బొలీవియాకు బయలుదేరుతూ కాస్ట్రోకు వ్రాసిన వీడ్కోలు లేఖ యిది. ఈ అనువాదం మక్కికి మక్కిగా (w0rd to word) చేసినదికాదు. అలాగని మూలంలోనిదేదీ వదలటం జరగలేదు. సౌలభ్యతకోసం కొంత సడలింపూ, వివరణా జరిగింది అంతే.]

ఫైడెల్,

మనం మేరియా అంటోనియా గృహంలో కలుసుకున్నపుడు మీరు క్యూబా విమోచనోద్యమంలోకి నన్నాహ్వానించటమూ, క్లిష్టమూ, ఉత్సాహోద్రేకభరితమూనైన మన సన్నాహాలు ఆదిగాగల గతస్మృతులన్నీ యీ క్షణాన నా మనోపథంలో మెసలుతున్నాయి.

ఈ సందర్భంగా మనలో ఎవరయినా వీరమరణం పొందిన పక్షంలో... ఆ విషయం తెలుపబడవలసిందెవరికనే ప్రశ్న వొకరు వేసినపుడు... ఆ ప్రశ్న వెనుక గల వాస్తవం మనల్ని కదిలించి వేయటాన్నికూడా యీ క్షణాన నేను గుర్తుచేసుకుంటు

"మరోసారి ఈ దేశం మోసపోగూడదు"
"యాభై కోట్ల కంఠాలు తిరుగుబాటు మంటలుగా మారాలి"
అంటున్న చెరబండరాజు కవితా సంకలనం
- దిక్‌సూచి -
వెలువడింది. వెల : రు. 2-50
ప్రతులకు:- 46, విద్యానగర్ కాలనీ, హైదరాబాదు-13.

న్నాను. నిజమైన విప్లవోద్యమంలో విజయమో, వీరస్వర్గమో వినా మరొకటి ఉండ బోదనే వాస్తవాన్ని ఆ తరువాత కాలంలో మనం అనుభవపూర్వకంగా గుర్తించాం.

ఈ విజయ యాత్రలో మన కామ్రేడ్స్ అనేకమంది నేలకొరిగారు.

అనుభవం రాపిడితో రాటుదేలిన మనకీనాడివేవీ విశేషాంశాలుకావు. కాని, చరిత్ర పునరావృతమవుతూనే ఉన్నది.

ఇంతకాలంగా క్యూబా విమోచనోద్యమానికి బంధించి నన్నక్కడ నిలిపి ఉంచిన బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించగలిగాననే నమ్ముతూ, ఇప్పటికే సావారయి పోయిన మీనుండి, మన కామ్రేడ్స్‌నుండి, విప్లవ క్యూబా ప్రజానీకంనుండి సెలవు తీసుకుంటున్నాను.

మన పార్టీ నాయకత్వంలోని నా స్థానాన్నీ, ప్రభుత్వంలో నాకుగల మంత్రి పదవినీ, సైన్యంలో నాకున్న మేనేజర్ హోదానూ, నా క్యూబా పౌరసత్వాన్ని వదలు కుంటున్నట్లుగా నేనిదివరకే ప్రకటించి ఉన్నాను.

కనుక...

ఈ క్షణంలో నన్నే బాధ్యతలూ క్యూబాతో బంధించలేవనే నమ్ముతున్నాను. మిగిలిన బంధాలంటూ ఏవన్నాఉంటే అవి మరోకోవకు చెందినవి.

పదవులలా వదలుకోటానికి వీలులేని ఆత్మీయమైన అనుబంధాలవి.

నా గత జీవితాన్ని మననంచేసుకుంటూన్న యీ క్షణంలో నేను మన విప్లవ విజయాలను దృఢతరం చేసేందుకై శ్రద్ధాగౌరవాలతో శాయశక్తులా కృషిచేశాననే నమ్ముతున్నాను.

నా ఒకేఒక ముఖ్య లోపమల్లా మొదటినుంచూడా విప్లవకారునిగా, మహో ద్యమ నాయకునిగా మీ యోగ్యతలను తగినంతగానూ, త్వరితంగానూ గుర్తించిఉండక పోవటమే.

నేనీ క్యూబా గడ్డపై అపూర్వమైన క్షణాలనేకం అనుభవించి ఉన్నాను...

ఉత్తేజకరమూ, విషాదభరితమూహుదానైన కరిబియన్ సంక్షోభసమయంలో మీ సరసన నిలబడి, ప్రజల మనిషిగా అనుభూతి నందగలిగాను.

ఆ సంక్షోభకాలంలో మరే మహానాయకుడైనా మీకన్నా చైతన్యవంతంగా వ్యవహరించి ఉండటం అసంభవం,

ఆ పరీక్ష సమయంలో నేను నిస్సంకోచంగా మిమ్మనుసరించినందుకూ, మీ ఆలోచనా ధోరణితో, అవగాహనలతో, సూత్రీకరణలతో ఏకీభవించగలిగినందుకూ ఈ నాడు గర్వపడుతున్నాను.

ఈ విశాల విశ్వంలోని యితరప్రాంతాలనుండి నా సేవలకై పిలుపందినపుడు దానిని అందుకోగల స్థితిలో నేనేనీనాడున్నాను.

కాని–

క్యూబా అధినేతగా మీకుగల బాధ్యతలు మిమ్మల్నిమాత్రం యిక్కడనే బంధించి ఉంచుతున్నాయి.

కనుక, ఫైడెల్...!

మనం విడిపోవలసిన, దూరంకావలసిన, సమయమాసన్నమైనది.

ఆనంద విషాదాలు రెండూ ముప్పిరిగొంటూన్న క్షణంలో నేనీ నిర్ణయానికి వచ్చినట్లు మీకు తెలుపుకుంటున్నాను.

ఒక నిర్మాతగా నాకుగల స్వచ్ఛమైన ఆశలనూ, నేను గాఢంగా ప్రేమించే ఆత్మీయులనూ యిక్కడ వదలి వెళ్లుతున్నాను...

తన్ను తనబిడ్డలా ఆదరించిన విప్లవ క్యూబా ప్రజానీకంనుండి శెలవు తీసుకుంటున్నాను... ఇది నాకత్యంత బాధాకరమైన క్షణమే...

కాని...

మన ప్రజలలోని విప్లవోద్వేగాన్నీ...

మీనుండి నేర్చుకున్న అకుంఠిత విశ్వాసాన్నీ... విప్లవ బాధ్యతవల్ల మనకు గల కర్తవ్యాన్నీ... సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట పవిత్ర బాధ్యతలనూ...

నావెంట నూతన యుద్ధరంగాలకు కొనిపోతూండగలటం ఈ నాబాధ నుపశమింపజేస్తున్నది...

ఫైడెల్,

నా అంతిమ క్షణాలు మరో భూభాగంపై ఎదురయే పక్షంలో...

ఆ తుదిఘడియలలో విప్లవక్యూబా ప్రజానీకమూ, ప్రత్యేకించి మీరూ నా స్మృతిపథంలో నిలుస్తారు.

నేనెక్కడున్నా మీరు చేసిన బోధనలకూ, చూపిన మార్గదర్శకత్వానికీ కృతజ్ఞుడనై ఉంటూ, నా కార్యకలాపాల అంతిమ ఫలితాలపట్ల బాధ్యతాయుతంగా వ్యవహరించ యత్నిస్తాను.

సదా విప్లవ క్యూబా విదేశాంగ విధానంతోనే నా పేరు ముడిపడివున్నది. భవిష్యత్‌లోకూడా అలాగేఉంటూ నేనొక క్యూబన్ విప్లవకారుడిననే విషయం సదాగుర్తుంచుకుంటూ ఆ గౌరవాన్ని నిలబెట్ట యత్నిస్తాను.

నా భార్యా బిడ్డలనిక్కడ ఏ జీవనాధారం లేని స్థితిలో వదలి వెళ్తున్నందుకు నేనేమీ చింతించటం లేదు. వారికై మిమ్మేమీ అభ్యర్థించనవసరంలేదనీ, విప్లవ క్యూబాయే వారిని కనిపెట్టి ఉండగలదనీ నాకు తెలుసును.

మీకూ, మన ప్రజలకూ ఎన్నెన్నో చెప్పుకోవాలని యీ క్షణాన నా కనిపిస్తున్నది. కాని, అది అనవసరం. నాలోని భావాలన్నీ వాక్యవిన్యాసం వివరించజాలదు. వట్టిమాటలు నిష్ప్రయోజనకరం.

విప్లవ విజయ సాధనాదిశగా సాగిపోతూన్న ఈ క్షణాన...

మిమ్ము నా విప్లవాలింగనంలో పొదువుకుంటూ శలవు తీసుకుంటున్నాను.

అనువాదం: చలసాని ప్రసాదరావు. — చే.


ఏఁవిటీ! మీ ప్రాంతానికి "ప్రభంజనం" రావటంలేదా?
అసలు మీరు "ప్రభంజనం" వినలేదా, చూడలేదా?!

దేశ రాజకీయ రంగంలోను, తెలుగు సాహిత్య రంగంలోను విప్లవాత్మక కల్లోలాన్ని సృష్టిస్తున్న మహోజ్వల రాజకీయ పక్ష పత్రిక. నేడే మీ ప్రాంతంలోని "న్యూస్ ఏజెంటు"ను ఒత్తిడిచేసి, మీ పత్రిక ప్రజల పత్రిక, పీడితుల పత్రిక, మన పత్రిక తెప్పించండి.

ప్రభంజనం
రాజకీయ పక్షపత్రిక

సం॥ చందా రు. 6-00, అర్ధ సం॥ చందా రు. 3-00, విడిప్రతి: 0-25
వివరాలకు:- ఎడిటర్, ప్రభంజనం, ప్రొద్దుటూరు, (కడప జిల్లా.)
ఏజంట్లకు మంచి కమీషన్

ఫ్రాన్సులోకాదు, అమెరికాలోకాదు,

జపాన్‌లోకాదు, కలకత్తాలోకూడకాదు,

తెలుగు దేశంలో తిరుగుబాటు విప్లవ రూపాల్లో

విద్యార్థుల చేతుల్లో, చేతల్లో-

విద్యార్థుల కొరకేకాదు, పెద్దల కొరకుకూడ,

ఈ నాటికోసమేకాదు, రేపటి కోసంకూడ,

విప్లవ సమాజ నిర్మాణం కోసం విద్యార్థులు నిర్వహిస్తున్నపత్రిక,

విద్యార్థులు నిర్వచిస్తున్న పథం-

# లాంగ్ మార్చ్

ద్విభాషా (ఇంగ్లీషు, తెలుగు) పక్షపత్రిక. వెల: 0-25 పైసలు.

సం॥ చందా రు. 8-00, అర్ధ సం॥ చందా రు 4-00

(ప్రత్యేక సంచికతో సహా)

---

ప్రతులకు, వివరాలకు:- మేనేజర్. లాంగ్‌మార్చ్,

12-9-3, ప్రకాశరావుపేట, విశాఖపట్నం-2

---

# విద్యుల్లత

యువ సాహిత్య మాస పత్రిక

సంవత్సర చందా రూ॥ 6-00 వెల : 0-60 పైసలు.

---

వివరాలకు, ప్రతులకు:- ఎడిటర్, విద్యుల్లత, కరీంనగర్.

---

# వాహిని

విద్యార్థులు నిర్వహిస్తున్న కరపత్రిక

వెల : 0-25 పైసలు. సంవత్సర చందా నాలుగు రూపాయలు

వివరాలకు:- రాజు, సంపాదకుడు, వాహిని, జడ్‌చెర్ల,

మహబూబ్‌నగర్ జిల్లా.